"పల్లెటూరు గ్రంథమండలి"
పదునారవ పుస్తకము

సంపాదకుడు
ముదిగంటి జగ్గన్నశాస్త్రి

# మేజినీ మహాశయుని
# మానవధర్మములు.







అనువాదకుడు

ముదిగంటి జగ్గన్నశాస్త్రి

రాజమహేంద్రవరము.



మొదటికూర్పు 1000





1930



వెల 0—12—0

# పీఠిక

మేజినీజీవితము నిదివరకే యాంధ్రలోకమునకు సమర్పించుకొనియుంటిని. రాజకీయవేత్త, మహావేదాంతి, వీరుడు ధీరుడునగు మేజినీమహాశయుని ధర్మములన్నియు మానవలోకము కంతకును వర్తించునవిగాని యేపక్షమునకో, జాతికో, దేశముకో, యుద్దేసింపబడిన ధర్మములుగానవని వేరుగచెప్పనక్కరలేదు. ఆత్మజ్ఞానరహితులు, నిర్వీర్యులు, బానిసలుగానున్నప్రజలకాదు యెన్నియోయుత్తమ ధర్మములు బోధింపబడినవి. ఆంధ్రసోదరులిందులోని యమృతవాక్యములను జుర్రికొని కృతకృత్యులయ్యెదరుగాక యని యాశించుచున్నాను. తుదియధ్యాయములను రెంటిని (ఇటలీకి సంబంధించినవి) అనువదింపలేదు.

ముదిగంటి జగన్నశాస్త్రి



# అంకితము

సత్యాగ్రహ యోగాగ్నిచే దగ్ధరాగ, భయ, క్రోధులై, జ్ఞానులై, వీరులై మహాత్ముని పాంచజన్య ధ్వానమును శిరసావహించి యాత్మార్పణ మొనరించు చున్న యాంధ్రవీరకుమారుల కీగ్రంథము నంకిత మొన ర్చుచున్నాను.

# మానవధర్మములు

నేను మీధర్మములను గురించి మీకు బోధింప నుత్సహించుచున్నాను. భగవంతుడు, మానవలోకము, జన్మభూమి, కుటుంబము అను నీపరమ పవిత్రచతుష్టయమును గురించి నాహృదయ ప్రబోధములను మీ కెరింగించెదను. ప్రేమ ప్రేరేపితుడనై నేను మీ ముందు మాట్లాడుచున్నాను. మీరును నా నుడువులను ప్రేమతో నాలింపగోరెదను. నాపలుకు లనేక సంవత్సరముల హృదయపరితాపముచేతను, పరిశోధనచేతను, నధ్యయనముచేతను, పొదగబడిన సంపూర్ణ విశ్వాస జనితమైన పలుకులు. నే నిపుడు మీకు బోధింపబోవు ధర్మములను నాకంఠములో ప్రాణము లున్నంతవరకు నాశక్తికొలది నే నాచరించుచునే యుందును. నేను ప్రమాదములకులోను కావచ్చును. కాని నాహృదయము మాత్రము యదార్థమైనది; నిర్మలమైనది. నే నాత్మవంచకుడనుగా వచ్చును. కాని మిమ్మెన్నడును వంచించువాడనుగాను. నన్ను మీసోదరునివలె నెంచి నాపలుకులను విన గోరెదను. నేను యదార్థమును చెప్పుచుంటినో లేదో యను విషయమును మీలో మీరు పూర్తిగా విచారించుకొనుడు. నేనసత్య

మును పలుకుచున్నట్లు మీకు తోచినయెడల మీరు నన్ను
త్రోసివేయుడు. లేక నేను సత్యదూతనని మీరు నిర్ణయించు
నెడల నన్ననుసరించి నేను బోధించు రీతిని చేయుడు. తప్పు
మార్గముబట్టుట దురదృష్ట విషయము; శోచనీయము;
శుభమార్గము కాని సత్యము నెరిగి దాని ననుసరింప బ్రయ
త్నింపకుండుట స్వర్గ భూలోక గర్హ్యమైన మహాపాతకము.

మీహక్కులనుగాక మీధర్మములను గురించియే నే
నేల మీకుతొలుదొల్త హితబోధ చేయవలెను? సంఘమం
తయు నైచ్ఛికముగనో అనైచ్ఛికముగనో మిమ్మణచిపెట్టు
చుండ మానవునికుండు సమస్తహక్కులును మీనుండి లాగు
కొనబడుచుండ దుఃఖమంతయు మీబరము చేయబడి సుఖ
మంతయు పైతరగతులలో వారమనుకొను వారనుభవించు
చుండ నేను మీకు మీవిజయమును గురించి కాక స్వార్థత్యా
గమును గురించియే యేల చెప్పవలెను? మీగుణగణములు
నైతికాభివృద్ధి విద్యాభివృద్ధి మొదలగువానిని గురించియే
మీ కేలబోధ చేయవలెను? మీయైశ్వర్యాభివృద్ధిని గురిం
చియే యేలమాట్లాడగూడదు? అని మీరడుగవచ్చును.
అనేకబాధలు పడుచున్న మీలో కొందరి హృదయము లిట్ల
నుచున్నవి. “మేము దరిద్రులము; బానిసలము; దుఃఖభాగు
నులము, మాకు మాఆర్థికాభివృద్ధిని గురించి, స్వాతంత్ర్య
మును గురించి, సౌఖ్యమునుగురించి బోధించుడు. మేమె

ప్పుడు నిక్లేశములు చుచు నుండవలెనని విధివ్రాసిపెట్టెనా? సౌఖ్య మనుభవించుటకు మేము నోచికొనలేదా? మాయజమానులకు మాపై స్వారీచేయుచున్న తరగతులవారికి మమ్ము యంత్రములవలె భావించుచు మానవలోకమంతకును చెందవలసిన సమస్తైశ్వర్యములను ననుభవించుచున్నవారికి ధర్మ బోధలను చేయుడు. మాకు మానవహక్కులను వానిని సంపాదించు సాధన సంపత్తిని మాబలమును గురించి బోధించుడు మాస్థితిగుర్తింపబడువరకును వేచియుండుడు. తరువాత మీరు మాకుధర్మములను స్వార్థత్యాగమును గురించి బోధింపవచ్చును" ఇట్లు వాదించువారు మీలో నెందరోకలరు.

కాని మీరొక్కవిషయమును మరచుచున్నారు. గత యేబదివత్సరములనుంచియు మానవహక్కులపేరటనే నిరంకుశ ప్రభుత్వములను వంశపారంపర్యపు ప్రభుత్వములను ధిక్కరించి మానవాభివృద్ధికొరకును కళ్యాణముకొరకును పోరాటములు జరిపిరి; స్వాతంత్ర్యమే సాధనమనిరి; ఐశ్వర్యమే జీవితావధియనిరి; వీనిపేరనే పోరాటము సాగింపబడెను. మానవహక్కులు ప్రకటింపబడెను. తత్ఫలితముగానే ఫ్రెంచి విప్లవమును తదనంతర విప్లవములును జరిగెను. స్వాతంత్ర్య సిద్ధాంతమును, వ్యక్తిహక్కులను ప్రకటింపవలెనను భావమును పురస్కరించుకొని యేగ్రంథములను వ్రాసిరి. విప్లవ బోధకులందరును మానవుడుసౌఖ్యము కొరకే పుట్టినాడ

నియు, దానిని సాధించుట కతడు తన చేతనైన యుపాయము లను వినియోగించుటకు హక్కు కలిగి యున్నాడనియు దాని నన్వేషించువాని నాటంకపరచుట కెవనికిని హక్కు లేదనియు, నతని నిరోధించు నెట్టి యాటంకములనైన నతడు కూల ద్రోయ హక్కు గలదనియు బోధించిరి. చివరకాటంకము లన్నియు తొలగింపబడినది. స్వాతంత్ర్యము సంపాదింపబడినది. అది యనేక దేశములలో చాలవత్సరములు నిలిచెను; కొన్ని దేశములలో నింకను నిలిచియున్నది. కాని ప్రజలస్థితి యేమై నను చక్కబడినదా! రాత్రియనక పగలనక కాయకష్టము చేసి చెమటలూడ్చి పనిచేయు కోటానుకోట్ల ప్రజాసామా న్యముయొక్క ఐశ్వర్యమువారిని వాగ్దానము చేయ బడినదానిలో నావంతయైనను చక్కజేయబడెనా?

లేదు! ప్రజల స్థితియెంతమాత్రమును చక్కబడలేదు సరికదా యది యన్ని దేశములలోను నానాటికి మరింత య ధ్వాన్నమగుచున్నది. జీవితమునకు ముఖ్యాధారములగు పదా ర్థముల వెల హెచ్చుచున్నది. అన్నివిధములగు పరిశ్రమల లోను కష్టించి పనిచేయువాని కూలి నానాటికి తగ్గిపోవు చున్నది. జనసంఖ్య హెచ్చిపోవుచున్నది. ప్రతి దేశములోను కాయకష్టము చేయువారి స్థితి మరింత హైన్యత నొందుచు న్నది; యుపద్రవకరముగ చున్నది; వేలకొలది జనులు పని లేక సోమరులై యుండవలసిన క్లిష్టపరిస్థితులు తరుచు సంభ

వించుచున్నవి. ఒక దేశమునుండి మరియొక దేశమునకు వలస పోవువారిసంఖ్య ప్రతివత్సరము హెచ్చుచుండుట; యూరపు నుంచి యితర దేశములకు వలసపోవుట; పని లేనివాండ్రకు, దరిద్రులకు, దిక్కులేని యనాథలకు కర్మాగారములను స్థాపింపవలసిన యగత్యమేర్పడుట వృద్ధి యగుట మొదలగునవి దీనినే సూచించుచున్నవి. ప్రజల యిక్కట్టులు మితిమీరి పెరుగుచున్నవి. ఇవి ప్రజల దృష్టి నాకర్షించినను తరుణోపాయము నారయుట శక్యము కాకయున్నది. యేబది సంవత్సరములలోను ప్రపంచైశ్వర్యసాధనము లెన్నియో కనుగొనబడినది. సాముదాయిక ద్రవ్యసంపత్తు అనేక విధముల హెచ్చినది; ఉత్పత్తి ద్విగుణీకృతమైనది వర్తకము బాహుళ్యమై యనేక మార్గములను బట్టి యెట్టి యంతరాయములనైన లంఘించి ప్రపంచమంత మూల మూలలకు బ్రాకినది, సరకులకు ప్రయాణములకు మితిలేని సౌకర్యములు చేకూరుటచే ఖర్చులు తగ్గి ధరలు కూడ కొంతవరకు తగ్గినవి. మానవులందరకు స్వభావ జన్మమైన హక్కులు కలవని ప్రతివాడు నంగీకరించుచునేయున్నాడు. ఐనను ప్రజల స్థితి యేల చక్కబడలేదు. సర్వైశ్వర్యములును సంఘములోనున్న ప్రజలందరకును సమానముగా పంచిపెట్టబడకయే కొద్దిమంది నూతన శ్రీమంతుల చేతులలోనో చిక్కుటేల దటస్థింపవలెను? పరిశ్రమలు వర్తకము యింత యభివృద్ధి నొంది ప్రజ సామాన్య

మంతను సుభిక్షముగా నంచకయే కొద్దిమందినో భోగపరా యణులను చేయనేల? కొంచమాలోచించితిమేని నిజస్థితి తేటపడగలదు. మానవుడు తనకున్న సంస్కారము లేక విద్య నుబట్టియే తయారగుచుండును; అతనికుండు విద్యాగంధమును బట్టియే యతని క్రియాకలాప మేర్పడును ఇంతవరకును విప్లవ ములను ప్రోత్సహించిన వారందరును వ్యక్తుల హక్కులనేరి టనే వానిని ప్రోత్సహించిరి. ఈవిప్లవము లు స్వాతంత్ర్యమును బడసెను. వ్యక్తిస్వాతంత్ర్యము, వర్తకస్వాతంత్ర్యము, మత స్వాతంత్ర్యము, విద్యాస్వాతంత్ర్యము, అందరకును స్వాతంత్ర్య ము; అన్నిటియందును స్వాతంత్ర్యము ఇట్టి స్వాతంత్ర్యము లన్నియు చేకూరినవి. కాని యీస్వాతంత్ర్యము లనుభవించు టకు సాధనము లేవేని వారికివి యున్నవనిన ఫలమేమి కలదు? వర్తకముకు కావలసిన ధనము కాని పరపతిగాని లేనివారికి వర్తకస్వాతంత్ర్య మున్నదనిన లాభమేమి? ధనసంపత్తికాని, తగిన సావకాశముకాని లేనివారికి విజ్ఞానస్వాతంత్ర్యమున్నదని చెప్పుట వలన ప్రయోజనమేమి? ఇట్టి స్వాతంత్ర్యములు కల వని ప్రకటింపబడిన యన్ని దేశములలోను యేకొద్దిమంది చేతు లలోనో భూమి, ధనము, పరపతి మొదలగు సమస్తైశ్వర్య ములుకలవు. ఇతర ప్రజా సామాన్యమంతయు తమ కాలు చేతులు తప్ప మరేయితర సాధన సంపత్తియు లేనివారై పైను దహరింపబడిన కొద్దిమంది శ్రీమంతుల పంచలబడి వారిచ్చు

కూలి కంగీకరించి యెట్లో జీవితమును గడుపుకొనుచు దినమంతయు సారములేని గాడిదపనికి తల యొగ్గవలసి వచ్చుచున్నది. కడుపుమంటతో నిత్యము పోరాడవలసిన వారికి స్వాతంత్ర్యమున్నదనుట వట్టిభ్రమ; పరిహాసము తప్ప వేరొండు కానేరదు, ఈస్థితిని చక్కబరచవలెనన్న పై తరగతులవారు కూలి చేయవలసిన కాలమును తగ్గించుట; తగినంతకూలి నిచ్చుట; ప్రజాసామాన్యమునకు నుచితముగా యెక్కువ తక్కువలు లేని విద్య నొసంగుట; అందరకును పనిముట్లను సరఫరా చేయుట; శక్తి,సామర్థ్యములు గలిగి న్యాయముగా పనిచేయువారికి బోనసుల నిచ్చుట మొదలగు పనులను చేయవలెను. "కాని వారట్లేల చేయవలెను? సర్వైశ్వర్యముల ననుభవించుటే జీవితము యొక్క పరమావధి కాదా? ఇతరుల లాభముకొరకు వారు తమభోగముల నేల కోల్పోవలెను? ఎవరిబాగువారే చూచుకొందురు గాక! మానవునికి గల హక్కుల నెవరిశక్తి కొలది వారనుభవించుటకు సంఘమంగీకరించుటతో దాని ధర్మము నెరవేరుచున్నది. తమ తమ పరిస్థితులచే నశక్తులయి వాని ననుభవింప లేనివారు తమగతికి తామే బాధ్యులు కాని యితరులను నిందింప బనిలేదు."

ఈవిధముగా బీదలపట్ల భాగ్యవంతులు నిరసనభావమును చూపిరి; దీని ఫలితముగా మనిషికిని మనిషికిని మధ్య నీనిరసనభావమే స్థిరపడెను. 'మాకాష్యం మాకారోగ్యం'

ఇతరులు చచ్చినను సరే! అను తత్వము ప్రబలెను. ఒకరి హక్కులు మరియొకరి హక్కులకు భంగకరమైనచో పరస్పర యుద్ధము సిద్ధము. ఈయుద్ధములో కత్తులు, కఠారులులేవు. రక్తపాతము పైకి కాన్పించదు. వంచన, కాంచనము దీనిలో నుపయోగింపబడు నాయుధములు, రక్తపాతముతో గూడిన యుద్ధముకన్న నిది పౌరుషహీనమేయైనను దానంతవినాశకర మైనదే యనుటకు సందియము లేదు. ఇది ధనవంతులు ధనహీనులను, శక్తిహీనులను నిర్దయతో నలిపివేయునట్టి క్రూర యుద్ధము; ఈనిరంతర పోరాటములో నహము, ధనకాంక్ష యుగ్గుపాలతో వృద్ధియగుచున్నవి, వ్యక్తిత్వము, వ్యక్తివిశ్వాసము ప్రబలి సంఘము, సాంఘికవిశ్వాసము నశించినవి. విద్యాస్వాతంత్ర్యము ప్రబలి నైతిక విద్రోహము పాతుకొనినది. సామాన్యసాంఘికమర్యాద, యనుబంధము లేకమత విశ్వాసముల పట్ల నైక్యత, లక్ష్య శుద్ధిచెడి, భోగమే పరమావధిగా భావించి యెవనిచిత్తము వచ్చినట్లు వాడు సంచరించుచున్నట్లు చేయుటలో నెందరి సోదరుల శిరోభంగములకైన వెరువక 'గోముఖవ్యాఘ్రము'లవలె నున్న సోదరశత్రువులైన మనుష్యులము తయారైతిమి. నిస్సందేహముగా మనకన్ని హక్కులును కలవు. కాని యీహక్కులన్నిటికంటె నుత్కృష్టమైనదేదియు లేనిచో వ్యక్తుల పరస్పరహక్కుల మధ్య సంభవించు సంఘర్షములలో సామరస్య మెట్లు

చేకూరగలవు? ఎవరు చేకూర్చగలరు? ఒకవ్యక్తిహక్కులకు ను లేక కొంతమంది వ్యక్తుల హక్కులకును దేశముయొక్క హక్కులకును పోరాటము వచ్చినపుడు దీనిని తీర్పగల న్యాయాధికారి యెవరు? అఖండైశ్వర్యము ననుభవించుటకు ప్రతి మనుజుని హక్కైనచో కూలివానికిని ఫ్యాక్టరీ యజమానికిని మధ్యగల జగడము నెవరు దీర్ప నర్హులు? జీవించుటకు ప్రతి వానికిని హక్కున్నపుడు దాని నితరుల లాభము కొరకు త్యజింప వలెనని యెవరు కోరగలరు? దేశము పేరిటగాని, సంఘము పేరిటగాని, కొందరుసోదరుల పేరిటగాని, మీరెట్లు శాసింపగలరా! దేశమన నేమి? వ్యక్తుల యధికారములను మరింత భద్రముగా కాపాడు ప్రదేశమే దేశమని వారి యభిప్రాయము సంఘమనగా నేమి? ప్రతివ్యక్తియొక్క హక్కులను తమబలముచే కాపాడుట కంగీకరించిన వారిసమూహమే సంఘము వ్యక్తిహక్కులను కాపాడుటకొరకే సంఘము స్థాపింపబడినదను నభిప్రాయములనే మనము బడిసంవత్సరముల నుంచి వ్యాపకము చేయుచు నేడు సంఘాభివృద్ధికొరకు వ్యక్తి హక్కుల నన్నింటిని త్యాగము చేసి యవసరమగుచో నిరంతర శ్రమకు, ఖయిదుకు, దేశాంతరశిక్షకు తల యొగ్గవలెనని బోధింతుమా? ఇంతవరకు నైశ్వర్యమే జీవితపరమావధియని బోధించి ధనము, అధికారము మొదలగునవి యనాగబాటు

లోనుండి (సోదరులనోగతి నొందిన నొందుదురుగాక!) వాని నాశ్లేషింప చేయిజాప వలదని వారి నెట్లు వారింపగలము?

నే నిట్లు సూచించుటలో నాకుతట్టినట్లెల్ల మాట్లాడుట లేదు. ఇది యథార్థము; చరిత్ర; మనము కండ్లార చూచు చున్న చరిత్ర; రక్తముతో, ప్రజలరక్తముతో ద్రవించుచున్న పుటలుగల చరిత్ర 1830వ నాటి విప్లవములో నొక తరగతికి బదులు మరియొక తరగతిని మార్చి (ఆమూడు దినములలోను చంపబడిన మీ ఫ్రెంచి సోదరుల శవములే సోపానములుగా గలిగి) యధికారములోనికి వచ్చినవారి నందరను కనుగొనుడు! వారిసిద్ధాంతము లన్నిటికి మానవహక్కులే పునాదులు వారికి మానవ ధర్మములందు విశ్వాసములేనే లేదు. మీ రిపుడు వారిని ద్రోహులనుచున్నారు. కాని వారు వారి సిద్ధాంతముల కనుగుణ్యముగానే ప్రవర్తించిరి. వారుద్భవించిన తరగతుల కుండవలసిన హక్కులను రాజుభంగపరచెను. కనుక వారు వానితో పోరాడిరి. వారికుండవలెనని వారనుకొనినంత యైశ్వర్యము వారికి చిక్కలేదు. కనుక వారు దానికొరకు పోరిరి. స్వతంత్రభావములను వెల్లడించినందులకు కొందరు శిక్షింపబడిరి. సర్వసమర్థులై మనోబల బుద్ధిబలము గలవారి నుపేక్షించి జ్ఞానహీనులకు శక్తిశూన్యులకు నుద్యోగముల నిచ్చిరి. కావున ప్రజలకనేక విధముల బాధలు కల్పింపబడెను. ఈవిధ

న్ని కారణములచే వారు ప్రభుత్వము నెదిర్చి, తీవ్రప్రచార
మును సలిపి, యుద్ధముచేసి తమహక్కులను లాగుకొనిరి, తమ
కోర్కె లీడేరుటతోడనే వారు తమ వెనుకనుండి తమకన్న
యన్నివిషయములలోను తక్కువ స్థితిలోనున్న ప్రజాసామా
న్యము యొక్క సంగతి మరచిపోయిరి. వారిహక్కులు
వారికి వచ్చేసినవి గనుక వారు హాయిగా సుఖించుచుండిరి.
వారిని ద్రోహులననేల? వారిసిద్ధాంతమే ద్రోహపూరితము.

కాని యీకాలములోనే యొక మహాగ్రబుద్ధి మాన
వులను దేశకాల పరిస్థితులను కూలంకషముగా బరికించి మా
నవధర్మములందే విశ్వాసము గలిగి సంఘమంతటి కళ్యా
ణముకొరకును, సత్యాన్వేషణము కొరకును, తద్విజయము
కొరకును సమస్తమును చివరకు ప్రాణములను గూడ త్యజింప
వలెనని బోధించి, నిందాస్తుతులకింత మాత్రము లోనగక
ప్రజాకళ్యాణము కొరకొక ప్రయత్న మోడిపోయినచో
మరియొక ప్రయత్నమును సలిపి, ప్రజలను మేల్కొలిపి
(ప్రజలకొరకు పాటుపడుచున్నామని చెప్పువారికంటె ప్రజ
లలోనే యెక్కువ సుగుణములు, కార్యశూరత్వము, విశ్వా
సము కలవని గ్రహించి) మానవధర్మములు, అను పవిత్ర
మంత్రమును నుపదేశించెను. మానవహక్కులకొరకు బోరా
డువారికిని మానవ ధర్మములకొరకు పోరాడువారికిని భేద

మిక్కుడనే కాన్పించుచున్నది. మొదటివారు తమహక్కులు సంపాదింప బడుటతోడనే తృప్తి జెందుదురు. రెండవవారికృషి వారి జీవితముతో గాని యంతమొందనేరదు.

సంపూర్ణముగా బానిసలు గావింపబడిన ప్రజల నభివృద్ధికి గొంపోవు ప్రతి సోపానమును దేశభక్తుల రక్తముతో సిక్తము కావలెను. వివిధములైన యుపద్రవములను మార్కొనట తప్పదు. అధికారులు జరుపు దుండగములను, అక్రమములను, రహస్య ప్రయత్నములద్వారా నెదుర్కొనవలసివచ్చుటచే మనప్రయత్నము ప్రజాబాహుళ్యమున కెరుకపడుచున్నదనుమనస్సంతుష్టియుండదు. చేసినకృషిని ప్రజలు మెచ్చుకొనుట కవకాశము లేకయుండును. పైగా నీపవిత్ర సాంఘిక సంగ్రామమును తమహక్కులకొరకు మాత్రమే సాగింపవలెనని దాని యుత్కృష్టత నిదివరకే తగ్గించిరి; ఇట్టివిపరీత పరిస్థితులలో నెట్టికష్టము నెదుర్కొనినను వీని ముందుకే తీసికొని పోగలశక్తి దేనికి గలదు? ఇట్టి యుత్సాహమునే మంత్రము ప్రసాదింపగలదు? నిరంకుశుల క్రూర కృత్యములకు తాళుశక్తి, యుత్సాహము కొద్దివత్సరముల పోరు జరిగిన తరువాత కొరతవడును! ఇట్టిపోరాటములలో దప్పకుండ సంభవించు పరాభవము లనేకములు కలిగినమీదట పోరాటమును విరమించుకొనవలెనను నిస్పృహ జం

మును; దీనినే శక్తి తరలింపగలదు? ఖయిదులలోనో, యురి
కంబములమీదనో, దేశాంతరములలోనో, మగ్గి నిరంతర
విచారములకు లోనయి క్షోభించుటకంటె వారేల ప్రశాంత
జీవితమునే కోరకుండవలెను? ఇటాలియనులలో నిట్టివారిని
మనమిప్పుడెంతమందిని చూచుటలేదు? హక్కులకొరకే వీరు
పోరిరి. వీరికథ యతి విషాదకరమైనది. కాని మూలసూత్రము
మారనపుడిట్లే జరుగుచుండును. ఉపద్రవములు, పరాభవ
ములు, వీరికి మరింత రోహదమును, బలమును చేకూర్చగల
సాధనములనియు, కొద్దివత్సరములు గాక నాజన్మాంతమును
వీరట్లు పోరవలెననియు మనమెట్లు యేసిద్ధాంతముపేర వీరికి
బోధింపగలము?

మనసంఘముకంటె మంచిపరిస్థితులు కలసంఘమే యైనను కేవల మానవహక్కులనే విశ్వసించువానిని ప్రజాసామాన్య ప్రయోజనముకు గాని, సంఘాభివృద్ధికి గాని తనశరీరము నర్పించవలెనని యెవరు బోధింపగలరు? ఒకడు సంఘముపై తిరుగబడి తనహక్కులనే పురస్కరించుకొని నేను సాంఘికానుబంధమును త్రెంచివేయుచున్నాను. నాశక్తిసామర్థ్యములు నాబుద్ధి యన్యవిషయములకు తగియున్నవి. వానినభివృద్ధి చేసికొనుటకు నాకప్రతిహతమైన హక్కుగలదు. నేను ప్రతివానితోను పోరు పెట్టుకొనుటకిచ్చగింతును. అని పలుకునపుడు మీసంఖ్య యెక్కువ యున్నంత మాత్రమునే నతనికోరికకు

నాదర్శములకు నడిపదని మీచట్టముల నంగీకరించి తీరవలెనని మీరతని నెట్లు నిర్బంధింపగలరు? వాటి నుల్లంఘించినచో నతనిని శిక్షించుటకు మీకేమి యధికారము గలదు? హక్కులు ప్రతివ్యక్తికిని సమముగానే యున్నవి. సంఘము గాజీవించు చున్నంతమాత్రముచే నూతనహక్కు లుద్భవింప నేరవు. వ్యక్తికంటె సంఘమునకు బలమెక్కువగలదు కాని యెక్కు వహక్కులు లేవు. దేశములోన, మానవలోకములోను నున్న యితరసోదరుల యిచ్ఛతో దన యిచ్ఛను మేళవింప జేయవలెనని మనమతనికెట్లు నచ్చజెప్పగలము? ఖయిదునో లేక నురితాటినో చూపించుటే మనకర్తవ్యమా! ఇంతవరకును వచ్చినసంఘము కిట్టిమార్గమునే త్రొక్కెను. కాని యిది యుద్ధక్రమము. మనకు కావలసినది శాంతి ఇది దౌర్జన్యముగా క్రూరముగా నణగద్రొక్కుట: మనకు కావలసినది సంస్కారము; విద్య విజ్ఞానము. విద్య! ఇదియేమనసిద్ధాంతము కంఠకును నూరాలసూత్రముమనశతాబ్ధమును క్షోభింపచేయుచున్న ప్రధానసమస్యయిదియే!మనమిపుడుచేయవలసినది దౌర్జన్యముతోనొకనూతనక్రమమును స్థాపించుటకాదు. ఇట్లు స్థాపింపబడిన క్రమము శాంతి, వెనుకటిదానికన్న మంచిదేయైనను యెప్పుడును నిరంకుశముగానే యుండి తీరును. నేడు మనయభివృద్ధి కాటంకపడు చున్నట్టి పసటములు బలముతో గూలద్రోసి మనయిచ్ఛను బ్రకటించు స్వేచ్ఛను బడసి మనజాతికి కళ్యాణప్రదమని

విశ్వసించు క్రమమును మనము బోధించి దాని నభివృద్ధి చేయుటకు ప్రజలలో దగిన ప్రబోధమును జరిపించవలెను. హక్కులపేరిట మనము ప్రబోధమును గాంచి శత్రువును కూలద్రోయవచ్చును! కాని జాతిలోనున్న సర్వపక్షముల వారికిని సామరస్యమును కుదుర్చుటకది యెంతమాత్రము నచాలదు. భోగమే జీవితపరమావధి యగుచో స్వార్థపరులును. ధనపిపాసులును మాత్రమే తయారగుదురు. వీరు తమరాగాదులతో నీనూతనక్రమమునుగూడ నచిరకాలములోనే మలినమొనర్తురు. కనుక మనమిట్టి సిద్ధాంతముకంటె మిన్నయైన విజ్ఞానసూత్రము నొకదానిని కనుగొనవలెను, ఇది యేధర్మము! ఒకభగవంతుని బిడ్డలమైన మనమందరము నీప్రపంచముమీద నొకేశాసనమును శిరసావహించవలెను. ప్రతివాడును తనకొరకేకాక యితరులకొరకే జీవించవలెను. 'పరోపకారార్థ మితం శరీరం' భోగము జీవిత పరమావధికాదు; తామేకాక తమతోపాటు యితరులనుగూడ గుణవంతులను. ధనవంతులనుజేయవలెను. మనసోదరులపట్ల నక్రమము, అధర్మము జరుగుచున్నపుడు వారికొరకు పోరుట మనహక్కే కాక విధికూడనై యున్నది. ఇట్టివిధిని, యిట్టిధర్మమును, జీవితకాలమంతయు సాగింపవలసిన ధర్మమును, నిర్లక్ష్యముచేయుట పాతకమని మనము ద్బోధించవలెను.

సోదరులారా ! నేను చెప్పుదానిని పూర్తిగా నర్థము చేసుకొనుడు? మీహక్కులవలన మీకు శాశ్వతమైన యభివృద్ధికలుగనేరదని చెప్పుటచే నేను మీహక్కులను పోగొట్టుకొనవలసినదని చెప్పుటలేదు. మీధర్మములను మీరునెరవేర్చినపుడే మీహక్కులు సంక్రమింపగలవని మాత్రమే చెప్పుచున్నాను. హక్కులకొరకే మీరుధర్మముతో ప్రారంభింపవలెను. భోగములేక ధనపిపాస మీజీవితాశయము కాగూడదని చెప్పుటచే మీరెన్నడును వీటికొరకు ప్రయత్నము చేయరాదని చెప్పుటలేదు. ధనమును సాధనముగా గాక పరమావధిగానే మనము తీసికొనినచో నెప్పుడును వినాశమే సంభవించును. రోమనుచక్రవర్తుల క్రిందనున్న రోమనులు మాకు మృష్టాన్నము, భోగపరాయణత కావలెనని కోరుకొనిరి, తత్ఫలితముగా వారతి నికృష్టజాతిగా తయారైరై చక్రవర్తుల క్రూరనిరంకుశ పదతాడనములను భరించి చివరకొక మోటుజాతికి దాసానదాసులు కావలసివచ్చెను. ఫ్రాన్సు మొదలగు దేశములలో సాంఘికాభివృద్ధికి శత్రువులైనవారు ధనపిపాసను పురిగొల్పి యవినీతిని వెదజల్లిరి. ఐశ్వర్యాభివృద్ధి మనకవసరమే! మనకొరకు దానిని మనమే సంపాదింపబూనెదము; మంచి యాహారము, మంచి యిండ్లు మనకు ప్రాణావసరమని మనము వాంఛించుటలేదు. మనము నిరంతర కడుపుమంటతో పోరుచుండ నెట్టినెత్తి

కాభివృద్ధిగాని. మన నిజశక్తినవగతము చేసుకొనుట కవ కాశము కానియుండదు. కనుకనే మనము వానిని కోరుచు న్నాము. మీరిపుడు రోజుకు పదితన్నెండు గంటలపని చే యుచున్నారు. ఇక మీవిద్యాభివృద్ధికి మీకవకాశమెక్కడ గలదు? మీలోచాలమంది మీకును, మీకుటుంబముకును చాలీచాలనంతమాత్రమే సంపాదించుచుండ చదువుకొనుట కు మీకుధనమేది? తప్పక పనిదొరుకునను నియమములే కపోవుట; అనేక యడ్డంకులు కలుగుచుండుట-యీకార ణములచే నొకప్పుడూపిరితిరుగకుండ పనియుండును; మరొ కప్పుడు పనిలేక సోమరులైయుండుట తటస్థించును. కనుక మీరొకసరియైన క్రమము, నియమము, చురుకుదనము యెట్లలవడకలవు? మీరార్జించునదే కొద్దియైనపుడు వృద్ధా ప్యముకు గాని, మీబిడ్డలకు గాని దాచుకొనుట కవకాశ మేది? మీలో చాలమంది దరిద్రముచే యేకొద్దియైనను సంపాదింతురను నాసతో చిన్నపిల్లలనుకూడ తల్లిదండ్రుల కృపాపేక్షణముల నుండి యీడబెరికి యేనిర్భాగ్యపు ఫ్యా క్టరీలలోనో సృక్కజేయు చున్నారు. ఇట్టిపరిస్థితులలో కు టుంబప్రేమ యెట్లు వికసింపగలదు? మీజీవితములను మీ కర్మలను నియమించు శాసనములలో యెన్నికలద్వారాగా ని మరేవిధమునగాని మీకేటిస్థానమునులేదు. మీకు నా గరిక హక్కులేవియును లేవు. కనుక నిట్టి ప్రభుత్వముపట్ల

మీకెట్టి యాసక్తియుండకలదు? మీకిట్టి చట్టములందు యదార్థప్రేమ మెట్లుకలుగును? మేముకూడ నాగరికహక్కులను కలిగియున్నారమని సగర్వముగా మీరెట్లుపలుకగలరు? ఇతర తరగతులకువలె మీకున్యాయము జరుగుటలేదు, కనుక న్యాయముపట్ల గౌరవప్రేమల నిక మీరెట్లు బోధింపగలరు? సంఘముకు మీపట్ల నాదర మెంతమాత్రము లేనపుడు మీకుసంఘముపట్ల నాదరము నెవరుబోధింపగలరు? మీనైతికాభివృద్ధికొరకు మీకార్థికాభివృద్ధి కలుగవలెను. మీరు తక్కువకాలము పనిచేయుచో జ్ఞానాభివృద్ధికి గొంతకాలము మీకు చిక్కకలదు. మీకష్టముకు తగినంత కూలి నిచ్చుచో దానిలో కొంతదాచుకొని భవిష్యత్తు విషయ మెట్టివిచారము నక్కరలేకుండ మీకన్యాయము చేయువారికి ప్రతి క్రియచేయవలెనని గాని, యపకారము చేయవలెనని గాని, పగదీర్చుకొనవలెనని గానియుండదు. శ్చింతలన్నియు మిమ్ముబాసి మీరు పవిత్రహృదయులగుదురు. మీ రార్థికాభివృద్ధికొరకు పోరవలెను. కాని యది యొక సాధనమేకాని పరమావధికాదని మీరు గుర్తించవలెను. అదియొకహక్కే కాక ధర్మమనియే మీరు దానికొరకు పోరవలెను. మిమ్ముఐశ్వర్యవంతు లనేగాక గుణవంతులనుగా చేయుటకే మీరు దానికొరకు పోరాడవలెను. లేనియెడో మీకును మీపైనస్వారిచేయు నిరంకుశుల

కును భేదమేమియుండును? భోగము, ధనము అధికారము యివితప్ప మరేవియు వారికక్కరలేదు. కనుకనేవారు నిరంకుశులైరి. మీరుత్తములు, యోగ్యులగుటయే మీ జీవితాశయము కావలెను. మీరుశాశ్వతమైన నిర్విచారస్థితి నొందుటకిదియే మార్గము. మీరైశ్వర్యము కొంకే పోరుచో ననక వేలమంది నిరంకుశులు మీనుండియే బయలుదేరగలరు, సాంఘిక వ్యవస్థలో మార్పుకలిగినను మీరును మీపైతరగతులువారును నేటి స్వార్థపరత్వమును, రాగాదులను పీడనంతకాలము లాభమేమియునుండదు. వ్యవస్థలన్నియు మొలకలవంటివి. వానినుపయోగించుకొను విధమునుబట్టి యవియమృతమో విషమో కావచ్చును. యోగ్యులైనవారు చెడువ్యవస్థలను మంచివిగాను చెడ్డవారు మంచివ్యవస్థలను చెడ్డవిగాను మార్చగలరు. మీరిపుడు మిమ్మణచిపెట్టుచున్న తరగతులవారికి హితబోధచేసి వారిధర్మమును గుర్తించునట్లు చేయవలెను. మొదట మీరుత్తములు కానిదే మీరిట్లు చేయజాలరు.

హక్కులవలననే సంఘమంతకు నూతన స్వరూపము కలిగింప గలమని మీకెపరేని బోధించుచో వారి సదుద్దేశములకు కృతజ్ఞతను జూపుడు! దానివలన గొప్ప ఫలితము కలుగునని మాత్రము విశ్వసింపకుడు. ధనవంతులకు దరిద్రుల కష్టములు కొంతవరకైనను తెలియక పో

లేదు; కాని వారికి హృదయవేదన మాత్రము లేకున్నది; అందరను బంధించునైమత మొకటి లేకపోవుటవలన కలుగును దాసీనతచేతను. నైశ్వర్యమే ప్రధానమని యనేక వత్సరములనుండి చేయబడుచున్న యుపదేశములచేతను, సంఘములో నిట్టి చెడుగులుండక తప్పవను వెర్రి వేదాంతమును ముందు తరమువారే నివారణోపాయములను చూచుకొందురను నిర్లక్ష్యమును ప్రబలెను. ఇట్లువారికి నచ్చచెప్పు టంతకష్టమైన పనికాదు; వారిని స్తబ్ధత్వమునుండి మేల్కొలిపి మీాతో చేతులు కలిపి భ్రాతృభావముతో మానవులకు సాధ్యమైనంతవర కెట్టి చెడుగులును లేనట్టి యోగ్యమైన సాంఘిక వ్యవస్థను నిర్మించుటకు పాటుపడునట్లు చేయుటే కష్టసాధ్యమైనపని. ఇదిధర్మముతో సంబంధించినపని; ఈప్రపంచములో భగవంతుడు మానవకోటి కొసంగిన ధర్మమే యిది. ప్రతివాడును స్వార్థత్యాగముతో నిరంతరమును సత్యము కొరకు పనిచేయుచుండవలెను; ఈధర్మమును నిర్వహింపవలసిన బాధ్యత ప్రతివానిపైనను కలదు.

సోదరులారా! జీససుపుట్టి యీప్రపంచము నుద్ధరించినపుడు ధనవంతుల కతడు వారిహక్కులను గురించి బోధించలేదు. బీదవారికిని బోధించలేదు; స్వార్థ, స్వప్రయోజనము లదివరకే నీతిదూరులను చేసిన ప్రజల కతడు వానిని గురించి బోధింపలేదు. ధర్మమును గురించియే యతడు

వారి కుపదేశించెను; ప్రేమ, స్వార్థత్యాగము, విశ్వాసము మొదలగు వానిని గురించియే బోధించెను! తమకృషిచే విశ్వమంతకును కళ్యాణము నెవరుచేకూర్తురో వారే యందరికన్నను శ్రేష్ఠులు, అని యతడు బోధించెను. చైతన్యముడిగి ప్రాణావశిష్టమైయున్న జాతి కిట్టి మంత్రోపదేశము చేయుటతోడనే నూతన వికాసము, నూతనశక్తి యావిర్భవించెను; లక్షలకొలది జన మీశంఖాధ్వానమునే పూరించిరి. ప్రపంచమంతట నీధ్వని మారుమ్రోగెను. మానవజాతి జ్ఞానమార్గమున కొంత యభివృద్ధి నొందెను. సోదరులారా ! మన మిపుడు జీసను జీవించినకాలమునాటి కాలములోనే యున్నాము. రోమను సామ్రాజ్యములో వెర్రితలలు వేసిన సంఘమువంటి సంఘములోనే మనమిపుడు జీవించుచున్నాము. దీనిని సంస్కరించుట దీనికి చైతన్యము నిచ్చుట మనవిధి. సంఘములోనున్న వ్యక్తులందరకు నొకే శాసనము నొకే విశ్వాసము నొకేప్రయోజనము; భగవంతుడు తనసృష్టి కొటి కొసంగిన సర్వశక్తులును స్వేచ్ఛగానభివృద్ధి చెందుచుండవలెననియే యతని శాసనము. భగవంతుని స్వర్గరాజ్యమే భూలోకమున నుండవలెను; భూలోకము స్వర్గలోకమున కొక సాధనగానుండవలెను. ఈదివ్యాదర్శమును చేరుటకు సంఘమొక ప్రధానరంగము.

జీససుయొక్క ప్రీతికార్యము నతడుబోధించిన మతము ననుసరించియే యుండెను. అతని చుట్టునున్న శిష్యగణము తూచా తప్పకుండ నతని లనుసరించుచుండిరి. మీరును వారివలెనుందురేని మీకు జయము నిశ్చయము మీపై తరగతులవారికి ధర్మమును బోధించి మీధర్మమును మీరు నెరవేర్చుడు. త్యాగము, గుణము, ప్రేమ-వీనినే బోధించుడు. మీయంతట మీరీధనత్రయము నారాధించుడు. మీకోరి కలను మీ యాదర్శములను నిర్భయముగా ప్రకటించుడు! కాని ద్వేషము, క్రోధ, హుంకారములను మీ దరికి రానీ యకుడు. భయపెట్టవలెనన్న (దీనికవసరమేయుండదు.) కోప మక్కరలేని యొక్క ధీరవచనమే చాలును! మీరు మీ తోడివారలకు వాని భావిభాగ్యమును గూర్చియు, వారిని గుర్తించి వారికి విద్యను, పనిని న్యాయమైనకూలిని యాత్మ గౌరవమును కలుగజేయు జాతిని గూర్చియు, మనదుష్ట ప్రభుత్వమును పరప్రభుత్వమును కలసి మనపై ప్రయో గించు దౌర్జన్యము లన్నిటిని ఓకోనగలశక్తినిగూర్చియు నుప దేసించుడు. మీధర్మములను పూర్తిగా గ్రహించి యాచరిం చుటకు తగిన శిక్షణమును యుత్తమసాధనమునుగూడ మీ రలవర్చుకొొనవలెను. ఇటలీలోనున్న ప్రజలందరకు నిది సా ధ్యము కానేరదు. ప్రజలయార్థిక స్థితిబాగుపడిన గాని ప్రజా విద్యయేదియు కొొనసాగనేరదు; దీనికితోడు రాజకీయ విప్ల

వముకూడనుండి తీరవలెను. మొదట ప్రజావిద్య కలుగవలె ననియు నదిలేనిదే స్వేఛ్ఛను బడయుట దుర్ఘటమనియువాదించువారు కేవలవ్యర్థవాదమునే చేయుచుందురు. అదియసాధ్యము, కానిమీలోపరిస్థితులు కొంత బాగున్నవారును, పరదేశములకు బోయి యున్నతవిద్య నభ్యసించినవారును నీపని చేయవచ్చును. చేయవలెను. ఈకొద్దిమందియే ప్రజల విద్యావిధానమెట్టి యదార్థసూత్రములపై నాధారపడి యుండునో గ్రహించినచో దానిని వారిలో వ్యాప్తిచేసి వారిని సురక్షితముగా నసత్య సిద్ధాంతములనుండి రక్షింప గలుగుదురు.





# భగవంతుడు.



## రెండవ ప్రకరణము.

మీధర్మము లన్నిటికిని భగవంతుడే మూలము. మీ ధర్మ నిర్వచన మతని శాసనములోనే కలదు. అతని శాసనమును కనుగొని దాని ననుష్ఠించుటే మానవవిధి.

భగవంతు డున్నాడు. దీనిని మీకు నేను రుజువు చేయనవసరములేదు; అట్లు చేయదలచుకొనలేదు. అతడు లేడనుట యెట్టిమూర్ఖ్యమో యత డున్నాడని రుజువు చేయ బ్రయత్నించుటగూడ దేవతా తిరస్కారమనియే నాతలంపు. మనమున్నాము; కనుకనే భగవంతుడును యున్నాడు. అతడు మన యంతఃకరణ మందున్నాడు; మానవాంతఃకరణ మందున్నాడు; మనచుట్టునున్న విశ్వమందున్నాడు. మహదానందముగాని, విచారముగాని సంభవించినపుడు మన యంతఃకరణ మతనిని మంత్రించుచుండును. మానవ లోకమతని నిజస్వరూపమును మార్చకలిగెను; దానిని మలిన మొనర్పకలిగెను. దానిని మలిన మొనర్పకలిగెను; కాని యాపవిత్రనామమును మాత్రము రూపుమాపజాలకపోయెను. ఈవిశ్వముయొక్క క్రమము; సామరస్యము, నడక శాసనములు మొదలగువానిలో

నున్న చైతన్యముద్వారా యతడు ప్రకటనమగుచున్నాడు. మీా లో శూన్యవాదులులేరు. ఎవరైన నున్నచో మనమతని కొరకు విచారపడవలయునేకాని శపించుట యుక్తముకాదు. శరచ్చంద్ర చంద్రికాధవళమగు చాంద్రమాసరాత్రియందుగాని ప్రాణతుల్యులగు వారి సమాధిస్థలమందుగాని, దేశభక్తులు చిరునగవుతో నురికంబముల కెగబ్రాకుచున్నపుడుగాని భగ వంతుడు లేడని వాదించు వాడతి క్రూరుడైనను కావలెను; లేదా దురదృష్ట శిఖామణియైనను కావలెను. తాను చేసిన పాతకము నితరుల దృష్టినుండి దాచిపెట్టి దానిని కనిపెట్టు చున్న సర్వసాక్షియైనవాడు లేడని త్రోసివేసి, మనస్తాప ము నెట్లో యణచిపెట్టుకొనిన వాడే మొట్టమొదటి శూ న్యవాది. తనసోదరుల స్వేచ్ఛనేగాక దానితోపాటు వారి యాత్మనుగూడ నపహరించి శాశ్వతహక్కులకును, ధర్మము పట్ల విశ్వాసమునకును బదులు పశుబలము నారాధించవలె నని బోధించిన వాడే నిరంకుశుడు. తరువాత నప్పుడప్పుడు శతాబ్దములు గతించిన కొలది వేదాంతులలో కొందరు వెర్రి వేదాంతము హెచ్చి శూన్యవాదమును సమర్థించిరి. కాని యిట్టివారు బహుస్వల్పముగా నున్నారు. తరువాత కొద్దికాలము క్రిందటనే స్వప్రయోజనము కొరకే నిరంకు శ ప్రభుత్వమో లేక కులమో భగవంతుని గురించి వ్యా పింప జేసిన యసత్యపు ●నేకబుద్ధి తక్కువ భావములచే

కుద్ధులై కొందరు భగవంతునే తిరస్కరించిరి. కాని వా రొక్క క్షణము మాత్రమిట్లు చేయగలిగిరి; ఆయొక్క క్షణములోను గూడ దైవమత్యావసరమగుటచే వారు న్యాయదేవతను, ప్రకృతిదైవమును నుపాసింపబోచ్చిరి. ఇప్పు డాచరణలోనున్న మత సిద్ధాంతులలో నవినీతి ప్రబలుట చే గొందరు మతమునే యసహ్యించు కొనుచున్నారు; వారు భావిమతములలోని పవిత్రతను గాంచజాలకున్నారు; కాని వీరిలో నొక్కఁడును శూన్యవాదినని చెప్పసాహసింపడు నిరంకుశులు తమ నిరంకుశత్వమును కాపాడు రక్షకుడని యతని పేరు నపవిత్ర మొనర్చుచుందురు; కొందరు పురో హితులధికారులకు భయపడి భగవన్నామము నపవిత్ర మొనర్చుచు చున్నారు. విషవాయువులు, పొగమంచు మొదలగు వానిచే మలినమై సూర్యకాంతి మనలను చేరు చున్నదను నెపమున మనము సూర్యుడే లేడనియు నతని కిరణములు విశ్వమునంతను చైతన్యవంతముగా జేయుట లేదనియు జెప్పదగునా? మూర్ఖులు స్వాతంత్ర్యమును దుర్వి ని యోగముచేసి యొక్కొకపుడరాజకమును దెచ్చిపెట్టు టచే మనము స్వాతంత్ర్యమును శపింపవలసినదేనా? మాన వులు భగవన్నామము నెన్ని యసత్యములతో నెంతమాలి న్యముతో అపవిత్ర మొనర్చినను నతడు దివ్యతేజస్సుతో వెలుగొందుచునే యుండును. నిరంకుశత్వమువలెనే యస

త్యములును, మాలిన్యమును నశించి పోవును; భగవంతుడు నతని ప్రతిమలైన ప్రజలును నిలిచియుందురు. దానిసత్వము, బాధ, దారిద్ర్యము ననుభవించుచుండు ప్రజలు క్రమముగా నాత్మశక్తిని, బలమును, మోక్షమును సంపాదించునట్లీ యవినీతిచే భ్రష్టముగావింపబడిన మతములనుండియే భగవంతుని దివ్యనామము పవిత్రము, యదార్థము యనన్యమునైన భక్తిచే దేదీప్యమానముగా వెలుగొందగలదు !

భగవంతు డున్నాడని ఋజువు చేయుటకుగాని మీ రతనిని పూజింపవలెననిగాని నేనపుడు మీకుబోధించుట లేదు. మీజీవితములును, మీ పరిసరములనున్న వారి జీవితములును మీకు గోచరించినపు డెల్ల మీ రతని నామము నుచ్చరించకుండగనే యతనిని సేవించుచున్నారు. మీరతని నెట్లు సేవింపవలెనో మీపై స్వారిచేయుచున్న తరగతులవారినుండి మీరుకూడ నేర్చుకొనిన ప్రమాదము నెట్లు వారించుకొనవలెనో యను విషయమును గూర్చియే నేను మీకు జెప్పదలచితిని.

భగవంతుని యతని సృష్టినుండి విడదీయుటయే మీరు గావించుచున్న ప్రమాదము; ఈజీవితములోనే మీరు కృతార్థత నొందవలసియు యీభూమినుండి యతనిని దూరము చేయుటయే ప్రమాదము; కొందమంది మీకిట్లు బో

ధింపవచ్చును. "భగవంతు డున్నాడనుట నిశ్చయము. దీని నంగీకరించి యతనిని సేవించుటే మీరు చేయవలసినపని. భగవంతునికిని మానవునకును గల సంబంధమును కనుగొను టెవరి తరమును గాదు. అది మీ యంతరాత్మ భగవంతుని లోనే సంపాదించవలసిన సమస్య దానిని గూర్చి మీ యిచ్చవచ్చినట్లు భావించుకొనుడు; కాని మీ విశ్వాసముల నితరులకు బోధించుటగాని ప్రపంచవిషయముతో సన్వయింప జేయుటకాని కూడదు. రాజకీయములు వేరు; మతము వేరు. ఆ రెంటిని కలగాపులగము చేయరాదు. పరలోక విషయముల నాధ్యాత్మికాధికారులకు విడిచిపెట్టుడు; వారధర్మ ప్రచారముకు గడంగిరని మీకు తోచిన యడల వారిని మీరు విశ్వసింపకుడు. ఎవని యిచ్చవచ్చినట్లువాడు భావించుకొన వచ్చును! విశ్వసింపవచ్చును. ప్రపంచ విషయములను గురించియే మీరేకముగా నాలోచింపవలసి యుండును. మీరాధ్యాత్మికవాదులైనను స్వాతంత్ర్యముభౌతిక వాదులైనను సమభావమునువిశ్వసింతురా? ఎక్కువమంది యైశ్వర్యవంతులై యుండవలెనని కోరెదరా? అందరకు నెన్నుకొను నధికారమును మీ రాశింతురా? ఈకోరికల నీడేర్చుకొనుటకు మీరందరు నేకముకండు! వీని కొరకు మీరు పరలోక విషయములను గురించియే కాభిప్రాయములకు రానశక్యములేదు" కొంద రీవిధముగా వాదింతురు. "దేవు

డున్నాడు; అతడు చాలా గొప్పవాడు; ఉత్కృష్టుడు మానవ మాత్రుల కృషిచే నతడు లభ్యమగువాడు కాడు; ఈభూమి యొక మంటిముద్ద; జీవితము క్షణభంగురము; ప్రపంచమునుండి మీశక్తి కొలది విముఖులుకండు; ఈజీవితముకు లేని యాధిక్యత నీయకుడు; తుచ్ఛప్రపంచ ప్రయోజనములకును నమృతమగు మీయాత్మ సామ్రాజ్యమునకును బోలికయే లేదు. దీనిని ధ్యానింపుడు; స్వర్గసౌఖ్యము నాశింపదు. / ఈసృష్టిమీద మీరెట్టి స్థితిలోనున్ననేమి? చావు మీకు తప్పదు; ప్రపంచవిషయములను గురించి కాక నతనిని గురించి మీరెట్లు భావించితిరో యను విషయమునే భగవంతుడు పరీక్షించును. మీరు బాధలనొందుచుంటిరేని వానిని మీకు ప్రసాదించిన భగవంతుని స్తోత్రము చేయుడు; ఆశీర్వదింపుడు. ప్రపంచ జీవితమొక పరీక్ష; ఈభూమి మీకు విదేశ ప్రవాసమంటిది దీనిని తృణీకరించుడు; ప్రపంచమును దాటుడు; బాధలు, బానిసత్వము, దారిద్ర్యము మొదలగునవి యనుభవించుచు ప్రార్థనలచేతను ప్రపంచవిషయములను దూరుటచేతను, పరలోకములో మీకు గలుగబోవు ఫలమునందు విశ్వాసము చేతను మీరు భగవంతుని సేవించుచు బవిత్రులు కండు"

ఇట్లు బోధించువారిలో మొదటివారు భగవంతుని ప్రేమించుట లేదు; రెండవవారు భగవంతుని యెఱుగరు.

మొదటి వారికి మానవు డేక స్వరూపుడని చెప్పుచు అతనిని రెండుగా విభజించి సాంఘిక వ్యవస్థలను పాలించు టలో మీతో నేకమగునట్లును, తన మొదలెద్దియో తుది యెద్దియో యిచ్చట నతడు పాలించవలసిన జీవిత ధర్మమె ద్దియో మొదలగు విషయములందు మీతో భేదించునట్లును చేయజాలరు. ప్రపంచమును మతములే పాలించుచుండును. భారతీయులు బ్రహ్మముఖమునుండి కొందరును బాహువు లనుండి కొందరును పాదములనుండి కొందరును పుట్టినట్లు విశ్వసించి మానవసంఘమును కులముల క్రింద విభజించి మొదటివారికి బుద్ధిబలమును చూపిన క్రియల నిచ్చిరి; రెం డవ వారికి యుద్ధ వ్యాపారము నిచ్చిరి; తదితరులకు హీన క్రియలను నప్పగించి సంఘమును జడప్రాయముగా గావించిరి? ఇట్టి సూత్రమును వారు విశ్వసించునంత కాలము మీ జడత్వ ము తప్పదు. క్రైస్తవ మతము మానవు లందరును భగ వంతుని బిడ్డలనియు, భగవంతుని కందరును సోదరులేయని యు ప్రపంచమునకు చాటినప్పుడు మానవులలో రెండు ప్రకృ తులున్నవని శాసించిన ప్రాచీనశాసనములును వేదాం తములును బానిసత్వమును కూలద్రోయుట కడ్డు రాజాలక పోయెను! దానితో నొక నూతన సాంఘిక వ్యవస్థయేర్ప డెను. మతవిశ్వాసములలో నభివృద్ధి కలిగినప్పుడెల్ల సాంఘి కాభివృద్ధి కూడ కలుగుచునే యున్నదని మానవచరిత్ర

రుజువు చేయుచున్నది. మతము నందలి మాయల సత్వమే యరాజకమునకు గారణముగు చున్నది. దీని వలన మీరు వినాశమును దెచ్చిపెట్టిరేకాని సృష్టింపజాలక పోయిరి. దీనిని మీరు కాదనజాలరు. కేవల వ్యక్తిస్వాతంత్ర్యమును బురస్కరించుకొని వర్తకములో నరాజకమును దెచ్చిపెట్టిరి; అనగా మీరు దుర్బలులను పీడించుచున్నారు; రాజకీయములలో వ్యక్తి స్వాతంత్ర్యమును దెచ్చిపెట్టి న్యాయమైన హక్కుల ననుభవించుటకు సాధన సంపత్తిగాని యవకాశముగాని జ్ఞానముగాని లేనట్టి దుర్బలులను వెక్కిరించుచున్నారు నీతిలో స్వార్థపరత్వమును దెచ్చిపెట్టిరి; అనగా తమకు దామొక్కరే సహాయము చేసికోజాలని దుర్బలులను త్యజించి వారి వినాశమును దెచ్చిపెట్టిరి. మనకు సౌభ్రాతృత్వము కావలెను. అందరను నడిపించు నొకే సూత్రమును విశ్వసించుచు నొకే మతముతో నైక్యతజెంది, యొకే నామముతో వ్యవహరించు సోదరులకే యిది సాధ్యము కాగలదు. మనకు విద్య విజ్ఞానము కావలెను. మానవుని మొదలెద్దియో, తుదియెద్దియో, మన లక్ష్యమేదియై యుండవలెనో, యీభూమి మీద జీవితము యొక్క లక్ష్య మేదియై యుండవలెనో యను విషయములను గురించి మనకొక విశ్వాసమేర్పడినగాని మన మిచ్చుటకును గ్రహించుటకును విద్య యుండనేరదు. మనకొక సామాన్య విద్యయుండవలెను; ఒక

సామాన్య విశ్వాసమున్నగాని యిది సాధ్యము కానేరదు. మన మొక జాతి కావలెను. మనకొక సామాన్యార్థము, ఒక సామాన్యధర్మము యున్నగాని మన కిందులో జయము చేకూర నేరదు. భగవంతుని గురించియు నతనికిని మనకును గల సంబంధమును గురించియు మనకు గల భావములే యీధర్మము నొసంగ కున్నచో నింకేది యొసంగ గలదు? అందరకు నెన్ని కాధి కారముండు టత్యావసరమే. చాల మంచిదే! విషయ పరిస్థితు లేవియు కలుగకుండ దేశమును పాలించుట కిది యొక్కటే న్యాయ సాధనము ఒకే విశ్వాసము గల దేశములోనిట్టి యధికారము జాతీయ కోరికను, జాతీయ పోకడలను వ్యక్తము చేయగలదు, కాని యొక సామాన్య విశ్వాసము లేని దేశములో నిది సంఖ్యాబలము గలవారి ప్రయోజనములను తదితరుల నణచి వేయుటను మాత్రమే సూచింపగలదు. మతము లేని దేశములలోను, మతమును నిర్లక్ష్యము చేయు దేశముల లోను గలుగు రాజకీయ సంస్కారములు వ్యక్తుల ప్రయోజనముల కుపకరించు నంతవరకే యుండును! తరువాత నవి గాలి కెగుర గొట్టబడును. యేబది వత్సరముల యనుభవము మనకు దీనినే వ్యక్తము చేయుచున్నది.

ఇక స్వర్గము వేరు యీప్రపంచము వేరు యని చెప్పు వారికి గమనము గమ్యమువలె నారంభము నొకటే

యని చెప్పుడు ప్రపంచము మంటిముద్దయని నుడువవలదు అది భగవంతుని సృష్టి; దీని సహాయమున మన మతని చేర వలెననియే యతడు దీనిని కల్పించెను. ఇది నరక కూప ముకాదు; మన కొరకు కేర్పడిన యుచ్చుకాదు; మనయా త్మాభివృద్ధికిని యుత్కృష్ట స్థితికిని పాటుపడుట కేర్పడిన రంగస్థలము భగవంతుడు మనలను ధ్యాన నిమగ్నులగుడని సృష్టింపలేదు. క్రియావ్రతుల మగుటకే యతడు మనలను సృష్టించెను, తన ప్రతినిధులనుగానే యతడు మనలను సృష్టించెను. సంకల్ప క్రియలే యతడు; అతనియం దవ్యక్త క్రియలేని సంకల్పమే లేదు. మనము ప్రపంచ విషయము లను తిరస్కరించవలెననియు, భౌతిక జీవితమును గర్హించ వలెననియు, దివ్యవిషయములను గూర్చియే యోజింప వలెననియు కొందరు చెప్పుదురు. కాని యీభౌతిక జీవిత మునకు ప్రథమరంగము ప్రథమ సోపానముకాదా? మన మెక్క వలసిన నిచ్చెనలోని చివరమెట్టునే శ్లాఘించుచు మొదటిమెట్టు యపవిత్రమైనదని తిరస్కరించుటచే మన మార్గమే నరికివేయ బడుటలేదా? ఆత్మయొక్క ప్రస్థానము జీవితము, ప్రతి యంతరువులోనుగూడ పవిత్రమైనదే! ప్రపంచమందును తరువాత వచ్చు నితర యంతరువు లందును గూడనది పవిత్రమైనదే! కనుక ప్రతియంతరువును తరువాత యంతరువునకు సాధనస్థానము గావలెను. భగవంతుడు

మిమ్మీ ప్రపంచమున కంపినాడు; మీవంటివారి ననేక లక్ష లను మీమట్టును కల్పించినాడు. మీమనస్సులవల్లనే వారి మనస్సులకు దోహరము కలుగుచున్నది; మీయభివృద్ధి వల్లనే వారి యభివృద్ధి కలుగుచున్నది; మీజీవితము వల్లనే వారి జీవితము సారవంతమగుచున్నది. ఏకాకి జీవితమువలన కలుగు నుపద్రవములనుండి మిమ్ము రక్షించుటకే యతడు మీయంతట మీరు తీర్చుకొనలేని యవసరములను మీకు గల్పించినాడు; జంతువులలోని దారుణమైయున్న సాంఘిక స్వభావమును మీకెక్కువగా నిచ్చినాడు. చైతన్య రసో ద్దీపితము. సౌందర్య శోభితమునగు (విషయాత్మకమని మీరు పిలుచు) నీప్రపంచమును మీ కర్పణచేసినాడు. భగవచ్ఛి హ్నమువలె బ్రతిచోటను గాన్పించు యీచైతన్యము మీ కృషి కెదురుచూచు చుండును. దీని ప్రకటనము మీ మీదనే యాధారపడి యున్నది. మీ క్రియాశక్తియిను మడించిన కొలదియు నిది మరింత తేజోవంతమగుచుండును. భగవంతుడు మీ కంతములేని దయాదాక్షిణ్యముల నొస గినాడు; దుఃఖితులపట్ల విచారము; సంతోషించు వారిపట్ల నానందము; తోడిప్రాణికోటిని హింసించు వారిపట్ల క్రో ధము; సత్యముపట్ల నిరంతర తృష్ణ; అపూర్వమైన సత్యము ను కనుగొనిన ధీమంతుని శ్లాఘించుటలు; అందరకును గళ్యాణ మొసగునట్లు దాని నాచరించిన వాని పట్ల నుత్సా

హాని లేకములు; దాని నాచరించుటలో జయము నొంద జాలక తనరక్తమునే చిమ్మి యసువుల నర్పించిన వానిపట్ల నత్యంతభక్తి తత్పరత:—భగవంతుడు మీధర్మ నిర్వహణ మునకు మీకిన్ని సాదృశ్యములను, చిహ్నములను జూపు చున్నను మీరు వీనిని నిరసించుచున్నారు. తమశక్తుల నన్ని టిని మన యాంతరంగిక పారిశుధ్యము కొరకే వినియోగింప నతని యుద్దేశ్యమని చూపు చిహ్నములను మీరు తూల నాడు చున్నారు. ఇట్లు చేయువారిని భగవంతుడు శిక్షింప క విడుచునా? బానిస పతితు డగుటలేదా? విద్యాగంధము గాని సంస్కారముగాని లేనట్టి భౌతిక చేష్టలయందే నిమ గ్నుల గుటచే దనలో నున్నది దివ్యశక్తిని వృధపుచ్చి యిం ద్రియ తాపములచేతను, రాగములచేతను నీడ్వబడిన వాడై కార్మికుడు తన యాత్మను కోల్పోవు చున్నాడు. తన దేశముకొరకు తన స్వాతంత్ర్యముకొరకు పోరాడు పోలండు దేశ జనికంటె రష్యా దేశములోని (Serf) అను బానిసలో నెక్కువ సజీవమైన మతవిశ్వాస మేమైన గాన్పిం చునా? లొంబార్డీ పట్టణములో ప్రజాప్రభుత్వము నాస్వా దించుచున్న వానికన్న యొక నిరంకుశ ప్రభువుచే నిర్వీర్య ము గావింపబడిన బానిసలో మీ కెక్కుడు భగవద్భక్తిద్యో తక మగునా? భగవచ్ఛక్తి యెచ్చటనుండునో యచ్చటనే స్వాతంత్ర్యముండునని యొక దేవదూత వచించెను; అతడు

మానవ స్వాతంత్ర్యము నరికట్టు నాటంకములను నాశము జేయ బ్రయత్నింపలేని స్వాతంత్ర్యమును మీరేల విశ్వసింపవలెను? మనసోదరులు ప్రతిదినము నిందా తిరస్కారములను, హస్తపాదతాడనములను ననుభవించుచుండ నూరకొనుచు మీరు సౌభ్రాత్రుత్వమని కేకలిడనేల? ప్రపంచమేమన రంగస్థలము. మనము దానిని గర్హింపరాదు; దానిని పవిత్రవంతము చేయవలెను. మనచుట్టునున్న ప్రాపంచి శక్తులే మన సాధన కుపకరించు పరికరములు; మనము వానిని నాశనముచేయరాదు; వానిని జగత్కల్యాణము కొరకే యుపయోగింపవలెను.

కాని భగవంతుడు లేకుండ మీరు దీనిని సాగింపజాలరు; నేను మీకు ధర్మములను గూర్చి చెప్పియుంటిని, మీ హక్కులను తెలిసికొనినంత మాత్రమున మీ యభివృద్ధి కది శాశ్వతముగా తోడ్పడ జాలదనియు, మీ పరిస్థితులలో మీరు కోరునట్టి నిశ్చయాభివృద్ధి నొనంగజాలదనియు జెప్పితిని. భగవంతుడు లేకుండ మనకు ధర్మమెచ్చట నుండి రాగలదు? భగవంతుడు లేని యెట్టి ప్రభుత్వమునకైనను సరే గుడ్డి నిరంకుశ, పశుశక్తియే పునాదిగా నుండి తీరును. ఇది యనివార్యము. మానవ కలాపమంతయు నొకదివ్యశక్తి, దివ్యశాసనము మీదనైన నాధారపడవలెను; లేదా యదృష్టము, తాత్కాలికముగా సంభవించు పరిస్థితు

లను భాగుగా నుపయోగించుకొనుశక్తి, పైన నాధారపడి యుండవలెను. మనము భగవంతుని యాజ్ఞలనో లేక మానవుని యాజ్ఞలనో శిరసావహించవలెను. మనతోడి వారు మనకంటె బలవంతులై మనల నణచివేయునపుడు మానవ బుద్ధి కతీతమైన యొక దివ్యబుద్ధి యుండినగాని మనలను రక్షించు వారెవరు? పవిత్రమైన యప్రతిహతమైన నొకదివ్య శాసనమున్నగాని యొక కార్యము ధర్మమైనదో యధర్మమైనదో మనమే సూత్రమునుబట్టి నిర్ధారణ చేయగలము? నిరంకుశత్వము అక్రమము ప్రబలనపుడు మన మెవరిపేర, దేనిపేర దాని నెదుర్కొనవలెను? భగవంతుడు లేనపుడు ప్రత్యక్షముకన్న వేరు పాలకు డెవడును లేడు! ఈప్రత్యక్షము విప్లవమైనను నిరంకుశత్వమైనను భౌతిక వాదులు దీని నెప్పుడును శిరసావహింతురు; సిద్ధాంత రీత్యా మన సూత్రముల నంగీకరించియు నిటలీలోనున్న భౌతికవారు లీప్రత్యక్షమునే తమస్వత్వమును సమర్థించుట కుపయోగించు కొనుచున్నారు. ఇట్టి స్తబ్ధలను స్వార్థత్యాగముకును, ప్రాణముల నర్పించుటకును వ్యక్తియభిప్రాయముల పేరిట మనమెట్లు ప్రేరేపింపగలము! కేవల మన ప్రయోజనములనే యాతగా గొని మనమొక సిద్ధాంతము నాచరింప బూనుట యుక్తమా? మోసపోకుడు! మనము వ్యక్తి పరముగా మాట్లాడునంత కాలము (మనమెంతటియుద్భుత సిద్ధాంతమును బోధింపవాడు)

యిప్పటివలెనే మనకు వాక్శూరులేగాని క్రియాశూరులు దొరకరు, "భగవదేచ్ఛ! భగవదేచ్ఛ" యను మంత్రమే పిరికిపందలను ధైర్యవంతులుగను, స్తబ్ధులను వీర్యవంతులుగను, మీాన మేషములు లెక్కించు వారిని త్యాగశీలురుగను, కేవల శుష్కమానవా దర్శములను విశ్వసించనివారిని విశ్వాసయుతులుగను జేయును. మీారు పూనుకొనిన స్వాతంత్ర్యమును, మానవాభివృద్ధియు భగవద్విధానములో నొక ప్రధానభాగమే యని రుజువు చేయుచో మిమ్మొక్కడును తిరస్కరింపడు. ఈప్రపంచములో మానవుడు సాధింప వలసినపనియతని యమృతత్వమున కొక ప్రధాన భాగమని బోధించుడు! అప్పు డతడు తన తాత్కాలిక ప్రయోజనములనుత్యజించును. భగవంతుడు లేనిదే మీారు శాసింపవచ్చును! కాని బోధింప జాలరు; దీనివలన మీారుకూడ నిరంకుశు లగుదురు కాని విద్యా ప్రదాతలు, దేవదూతలు కానేరరు.

సోదరులారా! భగవదేచ్ఛ! భగవదేచ్ఛ! అనునదియే ప్రజారావము; ఇటలీ జాతియు యీవాక్యమునే ప్రతిధ్వనింప జేయుచున్నది. ఇటాలి యనులకు రాజకీయపరిజ్ఞానము లేదనియు, మతావేశ మీాదేశములో నాశమునొందెననియు జెప్పువారి పలుకులచే మోసపోకుడు. ఇటలీ యెన్ని చీలికల క్రింద విభజింపబడినను నది తన యుత్కృష్టతను పటుత్వమును పీడినంతకాలము మతావేశము యధా

ప్రకారముగానే యుండెను. కాని 16 వ శతాబ్దములో ఫ్లోరెన్సు నగరము పడిపోయి యిటలీవిదేశీయుల హస్తగతమై ఫ్లారెన్సు యిటలీస్వాతంత్ర్య జీవితమును నులిపి వేసినపుడును, మత పీఠము నధిష్టించిన పోపులు దేశమును వంచించినపుడును, మనము జాతీయతత్వమును మరచి మన దేశములోనే జర్మనులవలెను, ఫ్రెంచివారివలెను, స్పెయిను దేశస్తులవలెను సంచరింప మొదలు పెట్టినపుడును మనమతము నాశనమయ్యెను. అప్పుడు మన విద్యాధికులు రాజకుమారుల కిచ్ఛకములను గూర్చుటకు ప్రతివానిని ప్రతి విషయమును వెక్కిరించుచు తుచ్ఛహాస్య జీవితమునకు గడంగిరి! మనమతబోధకులు మతవిధులను, సత్యములను నాచరించుట యసాధ్యమని భావించి స్వార్థముల కొడిగట్టి తాము ప్రబోధ ప్రచారములచే విద్యావంతులను గావించి రక్షింపవలసిన ప్రజలను మరచిపోయి, పవిత్ర విషయముల పేర ధనార్జన చేయ మొదలిడిరి. ప్రజలు విద్యావంతులచే దిరస్కరింపబడిరి! మత బోధకులచే వంచింపబడి ప్రజాద్రవ్యము కొల్లగొట్టబడెను; రాజకీయవిషయములలో నెట్టిజోక్యమును లేకుండ తరుమ గొట్టబడిరి! దీని ఫలితముగా వారు విద్యాధికులను నిందించుచు; మత బోధకులను విశ్వసింపక వెనుకటి మతము మాలిన్యము నొందుటచే (అంతకు మించిన సత్యమును చూపజాలక)

నన్నిమత సిద్ధాంతములపై తిరుగబడి పగదీర్చుకొన నారంభించిరి. అది మొదలు మనము నిర్వీర్యులమై నికృష్టులమై ప్రభుత్వము చేతనో దురాచారము చేతనో, యవిశ్వాసము చేతనో గలుగు మూర్ఖ్య సాంప్రదాయములచే నీడ్వబడు చున్నారము. కాని మన మిపు డభ్యుదయమును గాంచ వలెననియు నుత్కృష్టతను గౌరవమును బొందవలెననియు గోరుచున్నారము. మనము మన జాతీయ సాంప్రదాయములను జ్ఞప్తికి దెచ్చుకొందము! 12 వ శతాబ్దములో మన లొంబార్డి సోదరులు భగవన్నామము నుచ్చరించుచు జర్మనుల నోడించి తమ స్వాతంత్ర్యమును తిరిగి సంపాదించుకొనిన సంగతి జ్ఞప్తికి దెచ్చుకొందము! టస్కనీలోని నగరము లన్నియు దమ ప్రజాప్రభుత్వ పార్లమెంటులనుధర్మిలలోనే స్థాపించిన సంగతి జ్ఞప్తికి దెచ్చుకొందము! ఫ్లారెన్సులోని వారి శ్రామికులు దమ స్వాతంత్ర్యమును మెడిసీ ప్రభువుల కీయనొల్లక జీససుచేత తమ ప్రజాప్రభుత్వమున కధ్యక్షునిగా నెన్నుకొనిన సంగతి జ్ఞప్తికి దెచ్చుకొందము! భగవద్భక్తిని, ప్రజల హక్కులను మేళవింపజేసి పాడిన ఋషి సావనరలాయొక్క గీతమును 1746 లో జినీవాప్రజలు తమ యుపాస్యదేవతయైన మేరీ కన్యకనామముతో రాళ్ళనే యాయుధములుగా గైకొని జర్మను సైన్యముల నోడించిన సంగతియు, ప్రజాభావము

ను పోషించి, రక్షించిన మత ప్రభావ యుదంతమును జ్ఞప్తికి దెచ్చుకొందము! మతోత్సాహ మభ్యుదయమున కెదురు చూచుచు మన ప్రజలలో నిద్రాణమొందుచున్నది, ఇయ్యది రాజకీయ సిద్ధాంతముల కన్న నీశక్తిని ప్రబోధింపగల చతు రుడే జాతీయ మహోపకారకుడు నొనర్పగలడు. ఇంతవర కు యిటలీ విప్లవోద్యమములలో ప్రధాన నాయకులలో కేవలము విదేశ ప్రభుత్వ సాంప్రదాయములన్న, వారి నీతియు దప్ప నిట్టి మతోత్సాహము లేకపోవుటయు; బహు ప్రజా ప్రయోజనము లేకపోవుటయు, ప్రజలలో నీయుద్య మములపట్ల విముఖత్వమును గలిగించుటకు ముఖ్యకారణ ములు కనుక సోదరులారా! భగవంతుని పేరనే ప్రబో ధమును గావింపుడు! ఇటలీ యను హృదయము మున్న వాడెవడు మి మ్మనుసరింపకుండ నుండగలడు!

భగవంతుని పేర ప్రబోధించుడు. విద్యావంతులు నవ్వవచ్చును ఇట్టి విద్యావంతులు తమ దేశమున కేమి చేసిరో కనుగొనుడు. మత ప్రచారకులు మిమ్ము బహిష్కరిం పవచ్చును. వారందరును కలిసి తెలిసికొనిన దానికన్న భగవంతుని మీరే యెక్కువగా తెలిసి కొంటిరని వారికి తెలియ జేయుడు! భగవంతునకును వాని శాసనమునకును

భగవంతుడు నీకీజీవితము నొసగినాడు; కనుక భగవంతుడు నీకొక న్యాయమునుగూడ ప్రసాదించినాడు. మానవజాతి కంతకు నతడొక్కడే శాసనకర్త! ఒక్కయతని శాసనముకే నీవు తలయొగ్గవలెను. అతని శాసనమును స్వీకరించుటకు, నాచరణమునకు దెచ్చుటకు జేసిన మానవశాసనములే సమ్మాన్యములు; కళ్యాణప్రదములు; వానిని నిరాకరించుటయేగాక రూపుమాపుట నీహక్కేగాక ధర్మము గూడనై యున్నది. భగవంతుని శాసనము నెవడు స్వీకరించి జీవిత సమస్యలలో నాచరణకు దెచ్చునో యతడే నీకు మాన్యుడు. వానిని ప్రేమింపుము; అనుసరింపుము. కాని భగవంతుడు దప్ప నీకు వేరొక ప్రభు వుండజాలడు! అట్లుండరాదు, అట్లుండుట వానిని దిరస్కరించుటే, మోసము చేయుటే యని గుర్తింపవలెను.

కనుక నిట్టి జీవితపరమార్థమును భగవంతుని శాసనమును దెలిసికొనుటలోనే నీనైతిక పునాదు లేర్పడును; నీకృత్యముల యొక్కయు, ధర్మములయొక్కయు సూత్రమిచ్చుటనే కలదు; నీభాగ్యతలయొక్క ప్రమాణమిక్కడనే యేర్పడును. ఒకవ్యక్తిగాని, యనేక వ్యక్తులుగాని నీపై చెలాయింప జూచు నిరంకుశ శాసనములనుండి నిన్ను రక్షించునది కూడ నిదియే! ఈశాసనము నెరుగనిదే నీవు మానవహక్కుల పేరెత్తుటకే వీలులేదు. హ

కు లన్నియు నొక్క న్యాయమునుండియే పుట్టుచున్నవి. మీరీన్యాయమును గుర్తింప నంతకాలము నిరంకుశులైన యగుదురు; లేదా బానిస లగుదురు; మీరింతకన్ననుత్కృష్టులు కాజాలరు. బలవంతులైనచో నిరంకుశులగుదురు; దుర్బలులైనచో బానిసలగుదురు. కాని మీరు మనుష్యులు కావలెనన్నచో మానవ స్వభావమును పశుపక్ష్యాదులనుండియు, వృక్షములనుండియు, ఖనిజములనుండియు వేరు చేయుచున్న న్యాయమును గుర్తింపవలెను; తెలిసికొనవలెను.

మనము దానిని తెలిసికొనుటెట్లు? ధర్మము అను మాట నుచ్చరించిన వానిని మానవలోక మెప్పుడు నిట్లు ప్రశ్న వేయుచున్నది?! ఇప్పటికిని దీనికి భిన్నభిన్న సమాధానము లీయబడుచున్నవి. కొందరొకస్మృతినో పుస్తకమునో చూపి ధర్మమంతయు న్యాయమంతయు నిందులోనే యున్నదను చున్నారు. కొందరు ఎవని హృదయమును వారు తఱచిచూచినచో నచ్చటనే మంచిచెడ్డల నిర్వచనము కాన్పించు ననుచున్నారు. కొందరువ్యక్తి యభిప్రాయములను నిరాకరించి పదిమందిచెప్పినదే న్యాయమనుచున్నారు! మానవ లోకమొక విశ్వాసమును గలిగియున్నదో నదియే యధార్థమైన విశ్వాస మనుచున్నారు. వీరందఱును పొరబడుచున్నారు. ఈసమాధానములు నిర్వి

ర్యములని యనేక నిర్దుష్టమైన దృష్టాంతముల ద్వారా మానవచరిత్ర ఘోషించుచున్నది. ఒక పుస్తకములో నో లేక యొకవ్యక్తి వాక్కులలోనో న్యాయమంతయు నిమిడియున్నదని వాదించువారు మానవలోకము కొన్ని శతాబ్దములొకస్మృతి నంగీకరించి తరువాత దానిని మార్చివేసి యంతకంటె మంచిదానిని సృష్టించుకొనుచుండుట యాచారముగానున్న సంగతి గుర్తింపకున్నారు; ఇట్టి యాచారమిప్పుడేల మారిపోవలెనో తెలియకున్నది! మంచి చెడుగులను సత్యాసత్యములను నిర్ణయించుటలో వ్యక్తి యంతఃకరణ మొక్కటే ప్రమాణమని వాదించువారు యొంతపవిత్రమైన మతములోనైనను 'అవిశ్వాసకులు', మతవిధ్వంసకులు కలరనియు వారు కేవలము తమయంతఃకరణ ప్రేరణముచేతనే ప్రాణములను గూడ నొడ్డిరనియు తెలియ జాలకున్నారు. మనమతమునుండి బయలుదేరిన యొకచీలికయైన ప్రొటెస్టెంటు మత మిపుడనేక వేల చీలికలైనది; ఒకరితో నొకరుదలపడుచున్నారు; ఇదంతయు వ్యక్తియంతఃకరణము నేపాలింపవలెనను సిద్ధాంతముయొక్క ఫలితము. ఇప్పుడు యూరపు ప్రజలను పీడంచుచున్నసాంఘిక, రాజకీయ పోరాటముల కెల్ల నీయవిశ్వాసమే మూలకారణము. వ్యక్తియంతఃకరణమునే త్రోసివేసి మానవలోకము యొక్క సామాన్య విశ్వాసమునే పాటింపవలెనను వారు

మానవలోకాభి వృద్ధికి తోడ్పడిన మహదాశయము లన్నియు మానవలోకముయొక్క సామాన్య విశ్వాసముల నెదిరించి యే ప్రారంభమైనవనియు, మానవ లోకముచే దిరస్కరింప బడి, బాధింపబడి, కొరతవేయబడిన వ్యక్తులే వాని నుపదేశించిరనియు గుర్తింపకున్నారు.

భగవంతుని శాసనమును సత్యమును తెలుపుట కిందులో నీయొక్క సూత్రమో చాలదు; ఐనను వ్యక్తి యంతఃకరణము పవిత్రమైనది; మానవ లోకముయొక్క సామాన్యాభిప్రాయముకూడ పవిత్రమైనది; ఈ రెంటిలో దేనిని త్రోసిపుచ్చినను సత్యాన్వేషణమున కొక ప్రధాన సాధనమును పోగొట్టుకొనిన వారమే యగుదుము ఈ రెంటిలో కేవల మొకదానివలననే సత్యమును కనుగొన బ్రయత్నించుటే సాధరణముగా మనమింతవరకును జేయు చున్న ప్రమాదము. ఇట్టి ప్రమాదము భయంకర ఫలిత ముల నొసంగగలదు. వ్యక్తి యంతఃకరణమే సత్యమునకు ప్రమాణమన్నచో నరాజకమునకు దారితీయును; మానవ లోకముయొక్క సామాన్యాభిప్రాయమునకు తిరుగు లేదని నచో మానవ స్వేచ్ఛయే నశించి నిరంకుశత్వము నిశ్చయ మగును. ఇట్టి ప్రమాదములకు లోనయి వ్యక్తుల హక్కుల కొరకే కొందరు రాజకీయ సంస్థల నేర్పరచిరి; సంఘము యొక్క నైతిక ధర్మములను వారు మరచి పోయిరి: కొంద

రు సాంఘిక హక్కులనే పురస్కరించుకొని వ్యక్తి స్వాతంత్ర్యమును నశింపజేసిరి. ఫ్రాన్సు, యింగ్లండులు రెండును మొదటి విధానమెట్లు హెచ్చుతగ్గులను కల్పించుట యందును అనేకులు కొద్దిమంది నణచివేయుట యందును పరిణమించునో ఋజువుచేయుచున్నవి. ఇక రెండవ విధానము చైతన్యశూన్యమైన యభివృద్ధిని నిరోధించునట్టి సాంఘిక వాదము (Communism) గా పరిణమించును.

ఇట్లే వ్యక్తి హక్కులను బురస్కరించుకొని కొందరు ఒకరితో నొకరు పోటీపడుట కనివార్యమైన స్వాతంత్ర్యము కలదను సూత్రముపై నాధారపడిన యార్థిక పద్ధతిని తెచ్చిపెట్టిరి. కొందరు సాంఘిక మైక్యతనే గుర్తించి దేశములోని ప్రకృతిసంపద నంతను గుత్తగా ప్రభుత్వమే తీసికొనవలెననుచున్నారు. మొదటి సిద్ధాంతమువలన మన రాజకము వలన సంభవించు కీడులన్నియు సంప్రాప్తమైనవి; రెండవ దానివలన స్తబ్ధత్వము, నిరంకుశత్వములలో గల దుర్గుణములు ప్రాప్తించినవి.

భగవంతుడు నీయంతఃకరణము, నీతోడివారి సామాన్యాభిప్రాయము యను రెండు రెక్కల నతనిని జేరుటకే నీకు ప్రసాదించినాడు. ఈరెంటిలో నొకదానిని కత్తిరించుకొన నీవేల ప్రయత్నించెదవు? నీవే కాకిగా నుండవలెనని గాని, ప్రపంచము నిన్ను దిగమ్రింగివేయవలెనని గాని నీవేల కోరు

దువు? వ్యక్తిని గాని మానవజాతినిగాని నశింపవేయుటకేల యంగీకరింతువు? రెండును పవిత్రములైనవే! భగవంతుడు రెంటినుండియు వ్యక్తమగుచుండును. ఆ రెండును సమన్వయమైనపుడు, నీవ్యక్తి యంతఃకరణము మానవాభిప్రాయముతో నేకమైనచోటనే భగవంతు డున్నాడు; సత్యమప్పుడు నీ పిడికిలిలో నుండుట నిశ్చయము.

నీధర్మములు కేవల వ్యతిరేక ధర్మములే యైనచో, నీవితరులకు గీడొనరింపకుండుటతో నీధర్మ మంతరించినచో, నేర్పవిద్య నొందిన వాని యంతఃకరణముగూడ నీపనికి చాలియున్నదని చెప్పవచ్చును. అట్లుకాక మంచి చేయుటకే నీవు సృజింపబడినావు; న్యాయమునకు నీవు వ్యతిరేకముగా బ్రవర్తించినపుడెల్ల మానవులు నేరమని పిలుచునట్టి పనిని చేసినపుడెల్ల, నీలోనున్న యొకవాణి నిన్ను మందలించుచునే యుండును; నీయకృత్యమును నీ వితరులనుండి మరుగు పరచవచ్చునుగాని నీ నుండి మరుగు పరుచుకొనజాలవు. కాని నీవు విధాయికముగాచేసి తీరవలసిన ముఖ్యధర్మము లెన్నియో కలవు. నీవన్యాయము చేయకపోవుటతో సరిపోదు; న్యాయమునకు వ్యతిరేకముగా నడుచుకొనకుండుటతో నీవు తృప్తిపడరాదు; న్యాయము విధించు రీతిని నీవు నడువవలెను. నీసోదరుల కపకారముచేయకుండుటేకాదు! నీవు వారి కుపకారము చేయవలెను. నీతి

యనిన చేయకూడని దానిని వచించుటేగాక చేయవలసిన దాని నాజ్ఞాపించుట యని మనలో చాలమంది గుర్తింప కున్నారు ఇంతవరకును న్యాయము నుపదేశించిన వారందరును "నీవు చంపకూడదు; నీవు దొంగిలింప కూడదు" అని యుపదేసించిరే కాని మానవుల మగుటచే మనము తోడి మానవుల కెట్లు మంచిచేసి భగవంతుని సృష్టి విధానమును నెరవేర్చవలెనో చెప్పియుండలేదు.

నీతియొక్క ముఖ్య లక్ష్యమిదియే! ఏమానవుడు నొక్క తన యంతరాత్మను పురస్కరించుకొనియే యిట్లు చేయజాలడు. ఒక వ్యక్తి యంతరాత్మ యతనికున్న విద్య ఆచారము, మనఃప్రవృత్తి, రాగద్వేషములు మొదలగు వానిని బురస్కరించుకొనియే ప్రబోధించుచుండును. అడవి జాతి మనుష్యుని యంతరాత్మ ప్రబోధము వేరు; ఈయిరువదియవ శతాబ్దములోని నాగరికుని యంతరాత్మ ప్రబోధము వేరు. స్వేచ్ఛ ననుభవించువాని యంతరాత్మ బానిస యొక్క యంతరాత్మ చింతింపజాలని ధర్మముల బోధించుచుండును. విద్య యనునదెంత మాత్రమును లేకయే తెలిసీ తెలియని పురోహితుడు చేయు నీతిబోధలతో తృప్తి పడవలసిన యొక కూలివాని నడిగి చూడుడు! తన కుటుంబ పోషణముకై రోజంతయు కష్టపడి పనిచేయుట; యెంత తక్కువ కూలికైన (కడుపుమంటచే) నంగీకరించు

ట; ఎట్టి శాసనములు గావింపబడినను వాని నన్నిటిని గ్రుడ్డిగా శిరసావహించుట; ఇతరుల కపకారము చేయ కుండుట ఇవియే వానికి తెలిసిన సంగతులు "నీవు దేశ మునకు గావింపవలసినధర్మములున్నవనియు, నీవ్రపడుచున్న పాటులుచాలనికూలి కంగీకరించుటచేనీతోడివారి కపకారము చేయుచున్నావనియు, నక్రమమైన శాసనములకు తలవొ గ్గుట భగవంతునికిని నీయాత్మకును గూడ "ద్రోహము గావించుటే" యనియు మనము చెప్పుచో నతడు తె ల్లబోవుచు నిరుత్తరుడగును. కొంచము మంచిపరిస్థితులు గలిగియో లేక విద్యాగంధముగల వారిసహచర్యము చేతనో సత్యములో నొకయావంత గ్రహించిన యిట లీ పారిశ్రామికుని బ్రశ్నింపుడు. అతడు 'తన దేశము బా నిసత్వము ననుభవించుచున్న దనియు, తన సోదర లార్థి కనైతిక దారిద్ర్యము ననుభవించుచున్నా రనియు దన శక్తికొలది నీయన్యాయమును డీకొను టతని విధియైయు న్నదని యావేదన నొందుచున్నారనియు చెప్పును. ఒ కే దేశములో నొకే కాలములోనున్న యిద్దరు వ్యక్తు లయంతఃకరణములలో నింతటి వ్యత్యాసమేల పొడగట్ట వలెను? మానవాభివృద్ధిం గోరుచు నొకేసిద్ధాంతము నేక గ్రీవముగా నంగీకరించు పదిమంది వ్యక్తులలో విశ్వా సముల నాచరణకు దెచ్చుపద్ధతులను గురించి పదిభి

న్నాభిప్రాయము లుండుటకు గారణమేమి? ధర్మమును గుర్తింపజేయుట వ్యక్తియంతఃకరణ మొక్కటే యన్ని పరిస్థితులలోను చాలియుండదని దీనివలన స్పష్టమగుట లేదా? ఒక న్యాయమున్నదని మాత్రమే యంతరాత్మ చెప్పుచుండును. అన్యాయము మనపై విధించుచున్న ధర్మముల నంతరాత్మ బోధింపజాలదు. కనుకనే ప్రపంచములో స్వార్థమెంత పెరిగినను నంతఃకరణ ప్రేరణముచే ప్రాణములనర్పించు వారెప్పుడును కొరతపడుట లేదు, కాని మొత్తమంది తమ సర్వస్వమును కేవలము ప్రమాదములని నేడు మన మందరకును విశదమగుచున్న కల్పితధర్మముల కొరకాహుతిచేసిరో గ్రహించుకొనుడు !

కనుక మీయంతరాత్మ కొక యాదేశికుడు, యొకజ్యోతి, (తమస్సును ఛేదించునట్టిది) దానిప్రవృత్తిని స్థిరపరచినపుడు నట్టియొక సూత్రముకావలెను. జ్ఞానము, మానవలోకము. యిదియే ఇట్టిసూత్రము. భగవంతుడు ప్రతివానికిని బుద్ధిని ప్రసాదించినాడు; దాని నభివృద్ధిని ప్రసాదించినాడు; దానినభివృద్ధిపరచి యతని శాసనమును గ్రహించుటకొరకే మీకది ప్రసాదింపబడినది. నేడు మీదారిద్ర్యమును; శతాబ్దములనుండియు పేరులుపాతుకొనిన ప్రమాదములు, మీయజమానుల యిాప్సిత

ములు మొదలగునవన్నియు కలసి మీరు దానినభివృద్ధి పరచుకొన వీలులేకుండ చేయుచున్నవి. కనుకనే మీ రిట్టి యాటంకముల నన్నింటిని బలవంతముగా నూడబెరుకవలెను; కాని యిట్టి యాటంకములేవియు లేక పోయినను మీబుద్ధి యొక్కటిమాత్రమే భగవంతుని శాసనమును మీకు బోధింప జాలదు; దానికి తోడు మానవజాతి యొక్క బుద్ధి లేక వివేకముకూడ నత్యావసరము. మీజీవితము క్షణభంగురము; మీప్రత్యేక శక్తులు దుర్బలమైనవి; అనిశ్చయమైనవి; అన్యసహాయము నపేక్షించునవి భగవంతుడు మీయెదుట నొక నిరంతర ప్రవాహమువంటి సుమారు నాలుగువందల శతాబ్దములనుండియు వచ్చుచున్న ప్రతివ్యక్తియొక్కయు వివిధశక్తులమూర్తియైన మూర్తి నొకదానిని కల్పించియున్నాడు; వ్యక్తు లెంతమంది యెన్ని ప్రమాదములకు, దోషములకు లోనైన యీమూర్తి నీతి, విజ్ఞానములందు ముందుకే బోవుచుండును. భగవంతుడు ప్రతియుగమునందు నీమూర్తియొక్క యభివృద్ధి ద్వారా తన శాసనములో నొకపంక్తిని వ్రాయుచుండును. ఈ మూర్తియే మానవలోకము.

మానవలోకమనగా నిరంతరము జ్ఞానసముపార్జనము చేయుచుండు నొక మానవాకృతియని యొకకవి వర్ణించినాడు. వ్యక్తులు నశించిపోవు చుందురు. కాని వారు చేసిన

మంచికాని, వారు తెలిసికొనిన జ్ఞానలేశముగాని వారితో నశింపజాలవు. మానవలోక మీయన్నింటిని తనబొక్కసము లో గూర్చుకొనుచుండును. తరువాత వచ్చువారి సంతతి దీనిలబ్ధిని పొందుదురు. మనమింతవరకు మానవలోకమం తయు గూడబెట్టిన భావములతోను విశ్వాసములతోను నిండిన యొక వాతావరణములో పుట్టినారము; మనలో ప్రతివాడును తానెరుగకుండగనే భావి మానవలోక జీవిత మున కేదో కొంత సత్యమును కలుపుచునేయున్నాడు. ప్రతి పథికుడును తెచ్చు రాళ్ళచే నభివృద్ధిచెందు ప్రాచ్యదేశపు కట్టడములవలె (Pyramids) మానవ లోకజ్ఞాన మభివృద్ధి చెందుచుండును. పాంథులమైన మనమొక దినము నిటగడిపి జ్ఞానోపార్జనను పూర్తిచేయుటకు వేరొకచోటకు బోదుము. మనలో బ్రతివాని యందును మానవ లోకజ్ఞానము తళుకు తళుకుగా గాన్పించును. మానవ లోకము మాత్రము నెమ్మ దిగా క్రమక్రమముగా నిరంతరాభివృద్ధి చెందుచునే యుం డును. మానవలోకము భగవంతుని శబ్ద స్వరూపము భగ వచ్ఛక్తియుగయుగము లందొకప్పుడు వ్యక్తులద్వారమునను మరియొకప్పుడు ప్రజల ద్వారమునను ద్యోతకమగుచు మరింత పవిత్రతను, చైతన్యతను బ్రకటింపజేయుచు మానవలోక మును సార్థకము జేయుచుండును. ఒక కృషినుండి మరియొక కృషికి యొక విశ్వాసమునుండి మరియొక విశ్వాసమునకు

తరలుచు మానవలోకము క్రమక్రమముగా తన నిజ జీవితమును తన ధర్మమును, భగవంతుని, యతని శాసనమును వినిర్మల దృష్టితో జూడగలుగుచుండును.

భగవంతుడు మానవలోక రూపమున క్రమానుగతముగ బ్రకటమగుచుండును. భగవంతుడొక్కడే! అతని శాసనముకూడ నొక్కటే! కాని పురుషాంతరములనుండియు సంచితముగావచ్చు పరిజ్ఞానము. యనుభవము అభివృద్ధియగుకొలది, ననేకజాతులు, ప్రజలు, వ్యక్తులు సమ్మేళణమగుచు నైక్యతను గుర్తించుకొలది నాశాసనము కొద్దికొద్దిగా, యేమానవుడుగాని, యేయొక్క శతాబ్దముగాని దానిని పూర్తిగా గ్రహించినదని చెప్ప వీలులేదు. మానవలోకమంతయు నొక సంఘమై మానవపరికృతినిగూర్చు శక్తులన్నియు నభివృద్ధిగాంచి క్రియారూపమును దాల్చునపుడే మానవలోక జీవితమును శాశించు శాసనమవిచ్ఛిన్నముగా ద్యోతకము కాగలదు. ఈలోపున మానవలోకముననే భాగమత్యంత జ్ఞానాభివృద్ధిబడయునో యదితనయభివృద్ధి ద్వారామన మాశించుచున్న శాసనము నొకింత బోధించుచుండును. దాని చరిత్రలో మనము భగవద్విధానమును చూడవచ్చును; దానియవసరములలో మనధర్మములను గుర్తింపవచ్చును; అవసరములను బట్టియే మనధర్మములు మారుచుండును

లేక కలుగుచుండును. భగవంతుడు, కాలము నెంతవర కు మానవలోకము నభివృద్ధికి తయారుచేసెనో యంత వరకు దాని యభివృద్ధికి తోడ్పడుటే మనప్రథమ కర్తవ్యము.

కనుక భగవచ్ఛాసనమును గుర్తించుటకు నీయొక్క యంతరాత్మ నేగాక మానవ లోకముయొక్క యంతరాత్మను, విశ్వాసములనుగూడ బ్రశ్నించుచుండవ లెను. మానవ జాతియొక్క జ్ఞానమువలెనే, నీజ్ఞానమువ లెనే నీతికూడ నెప్పుడును క్రమాభివృద్ధి జెందుచునేయుం డును. క్రైస్తవమతము బోధించిన నీతితత్పూర్వపు నీతి కంటె భిన్నమైనది. ఇప్పటినీతి వేరు; పదునెనిమిది శతాబ్దముల క్రిందటినీతి వేరు. నేడు మీప్రభువులు మిమ్మితర తరగతుల వారినుండి వేరుపరచి, స్వేచ్ఛగా సమావేసము కాకుండ నిరోధములను గల్పించి, ముద్రణాస్వాతంత్ర్యమునరికట్టి మీరు మీధర్మములను, మానవ లోకావసరములను గుర్తింపకుండ చేయుచున్నారు. ఉచిత విద్యనొసంగుచు భూతమానవలోకచరిత్రను వర్తమాన మానవ లోకావసరములను మీజాతి మీకు బోధించుకాలము వచ్చువరకు, వీలైకి కోరికే యున్నచో, మీయంతమీరే కొంతజ్ఞానము సేకరించుకొనవచ్చును. మావలెనే బానిసదేశములలోనున్న సోదరులారా! మీరీవిష

యములను గ్రహింపకుండ మిమ్మెవరడ్డుపెట్టగలరు? యూరపులోజరుగుచున్న చారిత్రాత్మక విషయములను లక్షల కొలదిగ నున్న యిటాలియను ప్రజలనుంచి చిరకాలమెట్టి నిరంకుశ ప్రభుత్వమైనను దాచిపెట్టగలదా? ఇందులో నెంతమంది విదేశ యాత్రలను చేయుచు సంగతులను గ్రహించుటలేదు. ఇటలీలో నన్ని ప్రాంతములందును బహిరంగసంఘము లరికట్టబడినవి. కాని పైకెట్టి చిహ్నములుగాని, సంస్థలుగాని కాన్పించకుండనున్న సోదర రహస్య సంఘముల నరికట్ట నెవరితరము? ఇవి పట్టణపట్టణమును వలవలెనల్లుకొని సరిహద్దు ప్రాంతములను తాకినవి. మనదేశములో ప్రతిచోటను ప్రతిసరిహద్దు రేవు స్థలములోను మీయందలి ప్రేమచే మీకు సహాయము చేయ నుత్సహించుటచే ప్రభుత్వము వారిచే దేశాంతరములకు బంపబడిన వారెందరులేరు? మానవ సాంప్రదాయములను గురించియు, ప్రస్తుతాశయములను గురించియు విదేశవాసము వలనను, నధ్యయనము వలనను గడించిన జ్ఞానమును వారు మీకు బోధింపగలరు. మీసోదరులు విదేశములలో మీకొరకే రచించిన గ్రంథములను మీరు కోరుచో నెవరడ్డు పెట్టగలరు? వాటిని చదువుటతోడనే తగులపెట్టుడు! మీవెంటనంటు ప్రభుత్వ పక్షులపుడు మిమ్మేమియును చేయజాలవు. ధన సహాయముచేసి మేము

మాధర్మము నింకను దేశమంతటను వెదజల్లునట్లు చేయుడు మీ దేశచరిత్రను, ప్రపంచచరిత్రను వ్రాసిమేనుల మీాయభివృద్ధికి తోడ్పడునట్లు చేయుడు! వానిని దేశమంతటను వెదజల్లుటలో మాకు తోడ్పడుడు! శిక్షణము విద్యలేనిదే మీారు మీాధర్మములను గుర్తింపజాలరనుట నిశ్చయము. సంఘము మీాకట్టి యవకాశముల నొసంగనిచో మీారు గావించు తప్పిదముల కన్నిటికిని సంఘమే బాధ్యురాలుగాని మీారెన్నడును కారు. మీాకట్టి యవకాశము లొసంగబడినపుడు వాటిని నిర్లక్ష్యము చేసినపుడే మీారు బాధ్యులగుదురు. మీా రజ్ఞానులుగా నుండుటలో మీాదోషమేమియులేదు; కాని మీారట్టి యజ్ఞానావస్థలో నుండుట కంగీకరించి యూరకుండుటే మీాదోషము; అభివృద్ధిచేసికొనుట కొరకే భగవంతుడు మీా కనేక శక్తులు నిచ్చియున్నాడని మీాయంతరాత్మ బోధించుచున్నను మీాధర్మమును గుర్తెరుగక కుండుటే మీాదోషము; మీా మనశ్శక్తికి భావనాశక్తికి స్వస్తి చెప్పుటకే మీా దోషము; సత్యాన్వేషణమునకు తగిన సాధనములను కల్పింప నిదే భగవంతుడు సత్యమునందు మీాకంతప్రేమ నొసంగి యుండడని మీారెరిగియు నిస్పృహ చెందిన వారివలె మీారు దానిని విడిచిపెట్టి మీాపై నధికారము చేయు ప్రభుత్వము యొక్కయు, నాయధికారుల కమ్ముడైపోయిన పురోహితుని

యొక్కయు ధర్మ పన్నములనే సత్యములుగా స్వీకరించుటే మీదోషము.

జగత్పిత, మానవలోక శాస్త్రయైన భగవంతుడు తన శాసనములను మానవలోకమునకు 'దేశేకాలేచ' దేశ కాలములయందు బోధించుచునే యుండును. మానవ లోక సాంప్రదాయములను మీసోదర మానవ మహాసభను (ఒక్క శతాబ్దము నొక్కతరహాగా చింతించు నొక్కపక్షమును గాక) నన్నిశతాబ్దములలోని భూత, వర్తనమానము నవలోకమునంతను బరీక్షింపుడు! మీయంతరాత్మను మానవలోకము యొక్క యంతరాత్మను నొక్కవాణితో బోధించునదే సత్యము ; అక్కడ నే భగవచ్ఛాసనములో మీకొకపంక్తి ద్యోతకమగుచుండును. భగవంతుని శాసనమును సరిగా నెరిగింపగల యొక్కమానవలోకమునే విశ్వసింతుము. నేను మీధర్మములను గురించి చెప్పబోవున దంతయు నట్టిమానవలోకవాణియు మనయంతరాత్మయు నైక్యకంఠమున చేయు బోధలయొక్క సారాంశమే యని గ్రహించుడు!



# మానవలోకము పట్ల మహాధర్మములు

నాలుగవ ప్రకరణము



మీ ప్రథమ ధర్మములు మీ ముఖ్యధర్మములు మానవలోకమునకే చెందవలెను. వీనిని ముందర గ్రహించినచో తక్కిన యన్నింటిని మీరసమగ్రముగా మాత్రమే నెరవేర్చ గలుగుదురు. మీరు నాగరికులేగాక పుత్రులు, భర్తలు, తండ్రులు అగుటచే నెరవేర్చ వలసిన పవిత్రధర్మములనేకములు గలవు. మానవ ప్రకృతియే మీకీ ధర్మములను విధించుటచే నివి పవిత్రవంతములు- ననివార్యములు నగుచున్నవి. భగవచ్ఛాసనము నారాధించుచు, దానిని బహిరంగముగా ప్రకటించునట్లు చేయు విద్యాబుద్ధులను మానవులకు గరపుటకొరకే మీరు తండ్రులు కావలెను; మీకొక పౌరసత్వము, నొకదేశము యుండుటకు గారణమాచారములచేతను. భాషచేతను, భావములచేతను నదివరకే బంధింపబడిన మీరా చిన్న ప్రదేశములోనే సర్వప్రజల

బాగుకొరకును పాటుపడుమనియే ! మీసర్మములను మీ దేశముకును, మీకుటుంబములకును మాత్రమే వినియోగించునట్టి రీతిని బోధించువారు మీలో నొక విధమగు స్వార్థమును మాత్రమే పెంపొందించి మీకును నితరులకును గూడ చెడుగునే తెచ్చిపెట్టిన వారగుచున్నారు. దేశము కుటుంబము యను రెండును నొక పెద్ద వృత్తములో నిమిడి యున్న చిన్నచిన్న వృత్తములవంటివి. అవి రెండును నిచ్చెన మెట్లవంటివి. ఇవి లేకుండ నీవు పైకెక్కజాలవు కాని నీవు వానిమీదనే కూర్చొనక పైకిపోవలెను.

మీరు మానవులు; సాముదాయిక జీవనము గలిగి జ్ఞానసంపత్తితో వర్ధిల్లు జీవులు. సాముదాయిక జీవనము చేతనే పరిమితి లేని యభివృద్ధి నొందదగిన శక్తి కలవారు మానవ జీవిత ధర్మమును గురించి నేటివరకు మనకు తెలిసినదియే ! మన పరిసరములలోనున్న జీవరాసులను మనమండి వేరు చేయు లక్షణము లివియే! ఇదియే మానవ ప్రకృతి. ఈప్రకృతిని బీజముగాఁగలిగి సఫలత నొందుటకే యిది మీ జీవితమంతను నీప్రకృతి శక్తుల నభివృద్ధి చేసికొనుట కొరకే వినియోగింపవలెను. ఇందులో మీరేయొకశక్తి పూర్తిగా గాని కొంతగాని నష్టపోయినను మానవ జాతినుండి పతితులై మీ జీవిత ధర్మమును భగవచ్ఛాసనమును భంగపరచి పశుప్రాయులగుచుందురు.

మానవప్రకృతినిగూర్చుశక్తి నేదేనిమీలోగానియితరుల లోగాని మీరు భంగపరచినను యితరులు భంగపెట్టినపు డూరకున్నను మీరు పశుప్రాయులగుదురు. భగవంతుని శాసనమొక్క వ్యక్తులమూలముననే గాక నతనిప్రతిబింబములుగా సృజింపబడిన ప్రపంచములోని ప్రతిజీవరాశి మూలమునను సఫలతనొందవలెననియే యతని యాశయము. అతడు ప్రపంచమునకు బ్రసాదించిన పరిపూర్ణత ప్రేమయనునవి యెల్లప్పుడు నారాధింపబడి దేదీప్యమానముగా బ్రకాశింపవలెననియే యతని యాశయము. మీవ్యక్తిజీవితములలో (మీప్రత్యేకశక్తులచేతను, కాలము చేతను నిరోధింపబడినవగుటచే) నివి యెప్పుడు నసంపూర్తిగాను తటిల్లతవలెను మెరయుచుండును. తరతరము నిరంతరాభివృద్ధి నొందుచు ప్రతివ్యక్తియొక్క బుద్ధివిశేషము తన బుద్ధిని పెంపొందించుచుండ మానవలోకమొక్కటే యీదివ్యప్రదేశమును క్రమముగా ద్యోతకము చేయగలదు. కనుక మానవలోకము నుపయోగించుట కొరకే భగవంతుడు మీకీజీవితమునిచ్చి యున్నాడు. మీతోడి సోదరులశక్తి నభివృద్ధిచేయుట కొరకే మీకు ప్రత్యేకశక్తుల నిచ్చియున్నాడు; తరతరములనుండియు (నెమ్మదిగానైనను నిరంతరాయముగా) కలుగుచున్న యభివృద్ధికిని సత్యాన్వేషణముకును మీకృషిచే కొంతతోడ్పడగలుగుటకే మీకీజీవితమొసంగబడినది. మీరు జ్ఞానవంతులు కావలెను; ఇత

రులను జ్ఞానవంతులను చేయవలెను. మీరు పరిపూర్ణులుకావలెను. ఇతరులను పరిపూర్ణులను చేయవలెను. భగవంతుడు మీలోనున్నాడనుట నిర్వివాదాంశము; కాని భగవంతుడీప్రపంచములోనిప్రతిమానవునిలోను గూడనున్నాడు. భూత, భవిష్యద్వర్తమానములలో నున్నాడు. అత డెచ్చటనున్నను యే రూపములో నున్నను మన మతనిని సేవింపవలెను; కీర్తింపవలెను. ఈవిశ్వమతని దేవళము. ఈ దేవళమునకు జరుగు నపచారములను మనము నిరోధింపనిచో, ప్రతిక్రియను చూపింపనిచో మనము దండనార్హులమగుచున్నాము. నీయంతట నీవు పవిత్రుడవైనంత మాత్రమున లాభములేదు. ఏ కాకినైన నీవట్టిపవిత్రతను సంపాదించినను నీముందర రెండడుగులలోన పవిత్రతయున్నచో దానిని పోగొట్టుటకు బ్రయత్నింపవేని నీవు నీధర్మమునకు ద్రోహివేయగుదువు. నీహృదయములో నీవు సత్యము నారాధించినంతమాత్రమున లాభములేదు. ఈప్రపంచములోనే మూలనక్రము, యసత్యము అధికారము చేయుచున్నను నీవు నీ శక్తికొలది దానిని కూలద్రోయుటకు బ్రయత్నించనిచో నీధర్మమునకు ద్రోహముచేసిన వాడవగుచున్నావు. నీవు నీతోడి మానవుల యమృతాత్మల కపచారమొనర్చి భగవంతుని ప్రతిబింబమును మలినమొనర్చుచున్నావు. అతని శాసనముద్వారా మనమత నారాధించవలెననియే భగవంతుని

యభీష్టము; కాని యతనిశాసనము నీచుందర నేయపార్థములకు, ధిక్కారములకులోనై చివరకు నాస్తి యనబడుచున్నది. తనవిధానమును నెరవేర్చవలసినదని భగవంతుడు నీధర్మకర్తృత్వమునకు వప్పచెప్పినట్లే మానవప్రకృతిననేక లక్షల ప్రజల కొసంగెను; అది నిర్వీర్యముగా వింపబడినది. ఇట్టిపరిస్థితులలో మూకీభావమును వహించి ఆస్తికుడ వెట్లుకాగలవు?

గ్రీసు, పోలండు, సర్కేసియా మొదలగుదేశముల ప్రజల స్వాతంత్ర్యధ్వజము, మాతృదేశధ్వజము నెత్తి దానికొరకు పోరి జయింతురు; లేదా నాశము జెందుదురు ఆసంగ్రామ కథనములను వినునపుడు మీహృదయములేల స్పందించుచుండును? వారిజయముల కానందము నపజయములకు విచారమును మీహృదయములేల చూపుచుండును! నీతోడిమానవుడో లేక నే విదేశీయుడో మానవ ముద్రను వహించిన ప్రపంచమునుండి లేచి తాను సత్యములని నమ్మిన కొన్ని భావములను ప్రకటించును; ఎన్ని బాధలుపెట్టినను, కారాగృహముల కంపినను తన సత్యమును వీడక యురికంబముల మీదనే యతడు తన ప్రాణములు విడుచును. అతనిని ఋషియనియు, ధీరోదారుడనియు మీరేల గౌరవించుచున్నారు? అతనిని స్మరించుచు గౌరవిం

చుచు మీపుత్రులను గూడనట్లే చేయుమని మీరేల ప్రోత్స హింతురు.

గ్రీసుదేశపు దేశభక్తుల యత్యంద్భుత దేశభక్తికి ధనములను మీరేల నాశ్రయముగా చూరగొందురు? అవి మీతండ్రులే చేసినట్లుగా తలపంకించుచు సగర్వముగా వాటిని మీ కొడుకుల కేల వినిపించుచుందురు? ఈగ్రీసుచరిత్ర రెండువేలసంవత్సరములనాటిది; మన నాగరికత కెంతమాత్రమును చెంద జాలని పూర్వయుగమునాటిది. దేశభక్తుడని మీరు గౌరవించు నాతడే యాదర్శము కొరకు చనిపోయెనో యది మీ కుండక పోవచ్చును. ఐనను యతడు బుద్ధిపూర్వకము గా మృత్యువు నాలింగనముచేసి యిచ్చట నతని వ్యక్తి యభివృద్ధిని త్రుంచివేసికొనెను. జయాపజయముల నొందుచు మీ పొగడ్తలనందుచున్న ప్రజలు మీకు కేవలము విదేశీయులే కావచ్చును; మీ రెంతమాత్రము నెరుగని ప్రజలే కావచ్చును; వారి జీవితము వేషభాషలు మొదలగు వానితో మీ కేమియు సంబంధము లేకపోవచ్చును; వారిని సుల్తాను పరిపాలించిన మీ కేమి లేక బవేరియారాజు పాలించిన మీ కేమి? రష్యాచక్రవర్తి పాలించిన మీ కేమి ప్రజాసమ్మతిని బడసిన ప్రభుత్వము పాలించిన మీ కేమి? కాని మీలో నొక యంతర్వాణి యిట్లు పలుకుచుండును.

"రెండువేల వత్సరముల నాటి యాప్రజలు, నేడనేకవేల మైళ్ళదూరములో పోరాడుచున్న యీప్రజలు, తన యా ధర్మముల కొరకు (నీవు చేయజాలని విధమున) చనిపో యిన యాదేశభక్తుడు వీరందరును నీసోదరులు. మీపుట్టు క, మీప్రకృతివలననే గాక మీ క్రియాకలాపము చేతను మీగమ్యస్థానము చేతను గూడ మీరు సోదరులే యగుచు న్నారు. ఆప్రాచీన గ్రీకులు గతించిరి; కాని వారి కృషి శాశ్వతముగా నిలచి పోయినది; అదిలేనిదే నేడు మీకి ట్టి బుద్ధివిశేషము గాని నైతికాభివృద్ధిగాని యుండెడిదే కాదు. ఆప్రజలు తమరక్తస్రావము చే జాతీయ స్వాతంత్ర్యమను భావమును పునీతము గావించుటచే నిపుడు మీరును దాని కొరకు పోరాడుచున్నారు. ఆదేశభక్తుడు తనమృత్యువుచే మానవుడు తాను సత్యమని నమ్మినదాని కొరకు తన సర్వ స్వము నవసరమగుచో జీవితమును గూడ ధారవోయవలె నని ప్రకటించుచున్నాడు, అతడును నతనివలె తమ విశ్వా సముకొరకు తమరక్తమును చిమ్మినవారును నీప్రపంచము లో తమ వ్యక్తి యభివృద్ధిని త్రుంచి వేసికొనుట యొక యు నర్థముకాదు. భగవంతుడు వారికి మరియొకచోట సమస్త మును కల్పించియున్నాడు; కాని మానవ లోకాభివృద్ధియే యత్యంత ప్రధానమైనది. మీపోరాటముల చేతను, మీ త్యాగముల చేతను ప్రబోధమునొంది రాబోవు పురుషాంతర

ములవారు సత్యము నారాధించుటలోను భగవచ్ఛాసనము ను గ్రహించుటలోను మీకంటె నుత్కృష్టులు నెక్కువ శక్తి సంపన్నులు నగుటయే. పరిధానవిషయము ఉదాహరణములచే దిట్టతనమునొంది మానవప్రకృతి సరళమగుచు భగవదభీష్టమును గుర్తించుటే పరిధానము. మానవప్రకృతి యెక్కడ సరళత నొందినను, యెక్కడ నూతన సత్యము ద్యోతకమైనను, యెక్కడ ఆత్మిక, నైతిక, విజ్ఞాన పథమున నొక యడుగు ముందుకు బడినను నది మానవలోకమంతకునుగూడ కళ్యాణము నొనగూర్చినదే యగును. మీరందరు నొకే లక్ష్యమును సాధించుట కేర్పబడి వివిధపక్షముగా, వివిధ తెన్నులను బోవు సైన్యముగాని యోధులవంటివారు. ఈస్థితిలో మీరు మీపైనున్న యొక్క సమీపాధికారులులనే చూచుదురు వివిధములైన యాజ్ఞలు, దుస్తులు, వివిధ వ్యూహములమధ్యనున్న దూరము పర్వతములు మొదలగు నడ్డంకులచే మీదృష్టి యెంతసేపును సమీపగమ్యమునే చూచుచుండును. కాని మీయందరిపై నుండి సర్వమును తిలకించుచు జగచ్చక్రమును త్రిప్పువా డొకడున్నాడు. భగవంతు డొక్కడే యీసంగ్రామ రహస్యవేత్త; అతడు మిమ్మందరను నొక శిబిరము క్రిందకు నొక ధ్వజము క్రిందకు జేర్చగలడు.

నూతనయుగ నీతికి బునాదియై మన యంతరాత్మలను గదల్చుచున్నట్టి యిట్టి విశ్వాసములకును మన మిపుడు ప్రాచీనమని పిలుచునట్టి యుగమునాటి నీతికిని యెంతయంతరువున్నదో గ్రహించుడు! మన మూశించు దివ్యప్రభుత్వములకును, మన మాశించు మన ధర్మములకును నెంతదగ్గర బాంధవ్యమమరెనో చూచుడు! మొట్టమొదటి మానవులు భగవంతుని యాస్తిక్యతను తెలిసికొనిరి. కాని వా రతనిని పూర్తిగా గ్రహింపజాలక పోయిరి; వా రతని శాసనము శక్తిను గ్రహింప బ్రియమ్నింప జాలకపోయిరి; వా రతని నైనని తెలిసికొనిరి; కాని యతని ప్రేమను గుర్తింపలేక పోయిరి. వా రతనికిని మానవునకును నేదో సంబంధము గలదను కొనిరిగాని వారికి సమగ్రజ్ఞానము లేకపోయెను. ఇంద్రియ గ్రాహ్యములగు విషయములను దాటి వారు పైకి చూడజాలక వారి గుడారములవద్దనున్న పర్వతము. వారికి మొదట కాన్పించిన జంతువు, వారికి నీడ నిచ్చిన చెట్టు మొదలగు వానినే దైవతముగా నెంచిరి. మతచరిత్రలో దీనినే ( Fetictfsm) ప్రకృతి పూజయని పిలుతురు; ఆకాలములో మానవులు కుటుంబ బంధముతప్ప మరేమియు నెరుగరు; వారొక విధముగా తమంత తాము పునస్సృష్టి చేసికొనుచుండెడివారు; కుటుంబము కవతలనన్న వారందరును శతృవులే! తమ్ము తమకుటుంబమును రక్షించుకొనుటే వారి

ముఖ్యనీతి తరువాత తరువాత భగవంతునుని గురించిన భావము పెరిగినది. స్థూలవస్తువులనుండి దృష్టిసూక్ష్మమునకు సిద్ధాంతములకు మారెను; భగవంతు డొక్క కుటుంబము కే రక్షకుడుగాక ననేక కుటుంబములకు నగరములకు ప్రజలకు రక్షకుడని గ్రహింపబడెను. ప్రకృతియారాధనకు బదులు బహు దేవతారాధన వచ్చెను. అప్పుడు నీతికూడ విశాలమయ్యెను. మానవులు కుటుంబ ధర్మములనేగాక జాతి ధర్మములనుకూడ గుర్తించిరి. కాని మానవలోకము మాత్రము గ్రహింపబడలేదు. ప్రతిజాతియు మరియొక జాతిని మోటుజాతియని పిలుచుచు బలిమినో కూటపద్ధతినో వారి నోడించి యణగద్రొక్కుటకే చూచుచుండెడివి: ప్రతి జాతియు తమ మధ్యనిట్టి మోటు జాతి వారి ననేక లక్షల మందిని కలిగి యుండెడిది; వారిని నాగరికులు మత విధుల లోనికి రానీయక వారి ప్రకృతి వేరుగాను, స్వతంత్రుల లో వారు బానిసలుగాను పరిగణింప బడుచుండెడివారు భగవంతు డొక్కడే యని గ్రహింపబడు నపుడే మానవజాతి యంతయు నొక్కటేయని యంగీకరింపబడగలదు. భగవంతు డొక్కడే యని ప్రాచీను లతిసకృతుగా యోజించువారుండిరి; మోసెసు దానిని బహిరంగముగా చాటెను రోమను సామ్రాజ్యము నాశనమయి క్రైస్తవమతము బయలు దేరి దీని నుద్ధరించెను. క్రీస్తు తన బోధకంతకును

ప్రధాన సత్యములను రెంటిని ప్రకటించెను. భగవంతు డొక్కడే యున్నాడు; మనుష్యు లందరును భగవంతుని బిడ్డలు; ఈరెండు సత్యములను చాటుటతోడనే ప్రపంచదృష్టి యంతయు మారిపోయెను. నీతి మరింత విశాలత నొంది మానవలోక మంతకు ప్రపంచమంతకు నన్వయింపబడెను. కుటుంబధర్మములకును జాతిధర్మములకును మానవ ధర్మము లుగూడ జేర్చబడెను. అప్పుడు మానవుడు తన కెక్కడ తోడి మానవుడు కాన్పించిన నతడు తన సోదరుడే యని యు తనకు వలెనే యతనికి నమృతమైన యాత్మకలదనియు భగవంతుని జేరుటే దాని యాశయమనియు వానియెడల ప్రేమను యవసరమగుచో వాక్కార్య సహాయములను జూపవలెననియు గ్రహింపగలిగెను. తరువాత వచ్చిన మన ప్రవక్తలు క్రైస్తవ మతములో సూత్రప్రాయముగానున్న మరికొన్ని యమోఘములైన సత్యములను వెల్లడించిరి; ప్రాచీనుల కివి యర్థముకావు; మతప్రవక్తల తరువాత వచ్చిన వారందరు వీని నపార్థములు చేసిరి లేదా తృణీకరించిరి ఒక శరీరమున కనేకాంగము లుండియే యంగమున కా యంగము వివిధధర్మములను నెరవేర్చుచున్నట్లే మనమును క్రీస్తు శరీరమున కనేకాంగములవంటి వారము; ప్రతివాడు ను యితరుల కంగమువంటివాడు. మనమందరము నొకటే మంద; ఒక్కడే కాపరి" పదునెనిమి శతాబ్దముల యనుభ

వము యధ్యయనము, పరిశ్రమయైన తరువాత నేడు మన మీామొలకల నభివృద్ధిచేసి, యీసత్యములను ప్రతివ్యక్తి కిమాత్రమే కాక భూతవర్తమాన మానవశక్తుల మొత్తముకంతకు, మానవకోటికంతకు, నన్వయింప జేయవలసిన సమయమువచ్చెను. మానవలోకమంతయు నొక్కశరీరము; దాని నొక్కటేశాసనము పాలించవలెను! ఈ శాసనముయొక్క ప్రథమసూత్రము అభివృద్ధి; భగవద్విధానమును మనశక్తికొలది సాధించవలసిన యిచ్చట నీ ప్రపంచములో నభివృద్ధిచెందుట; ముందు త్తమగతులను బడయుటకువలయు విజ్ఞానము సంపాదించుట; మానవలోకమంతయు నొక్కశరీరము; మనమందరము దానికంగములము; కనుక దాని యభివృద్ధికొరకు పాటుపడి దానిజీవితములలో నెక్కువ సామరస్యమును, చైతన్యతను. శక్తినిచేకూర్చుట మనవిధాయక ధర్మమైయున్నదని యెలుగెత్తి చాటవలసియున్నది. మనము మనతోడిమానవుల యాత్మలద్వారమున మాత్రమే భగవంతుని జేరగలమని విశ్వసింపవలసిన కాలమువారాసింపకుండగనేమనము వారియభివృద్ధికిని, పవిత్రతకును దోడ్పడవలసిన కాలము ఆసన్నమైనది. యిచ్చట నీప్రపంచముమీాది భగవద్విధానమును మానవలోకమంతయు కలసి నెరవేర్చవలెను గనుక వ్యక్తులపట్లనే గాక సంఘములపట్లనే దయచూపి

యందలి యభివృద్ధిని లక్ష్యముంచుకొని కుటుంబమును దేశమును యీ పరిణామ జనము కొరకే తయారు చేయవలసిన సమయమాసన్నమైనది. మనజీవితధర్మమును గురించి నిర్మల, పరిపూర్ణభావము లభివృద్ధియైనకొలది ముందు ముందన్భుతధర్మములు లేకను నెన్నియోగాంప్రహ్యము కాగలవు. జగత్పితయైన భగవంతుడీవిధముగా, నెమ్మదిగా నాధ్యాత్మిక జ్ఞానమునొసగి మానవలోకము నతుత్కృష్ట విషయములకు గొంపోవుచుండును. యీయభివృద్ధిలో వ్యక్తుల యభివృద్ధికూడ జరుగుచునే యుండును.

మానవలోకాభివృద్ధితో బాటు మనమభివృద్ధి చెందుచుందుము; అందు నభివృద్ధి చెందకుండ మన మొక్కరమే యార్థికముగాను, నైతికముగాను వృద్ధి పొందజాలము. సామాన్యముగా నీవు మానవలోకమునుండి నీజీవితమును వేరు చేయజాలవు. నీవందులో జీవింతువు. నీవు దానివలన దాని కొరకే జీవింతువు. మనచుట్టునున్న విష పూరితమైన గాలి యెట్టి దృఢకాయము గలవానికైన నెట్లు క్షీణింపరించునో యట్లే మీయాత్మలు (అసాధారణప్రజ్ఞగలయే కొద్దిమంది యో తప్ప) పరిసరములచే బంధింపబడక తప్పదు. దేశములో నిరంకుశులును వేరుగలవాండ్రును చెలరేగి ప్రజలను బాధించుచు వారి నిజభావములను వెల్లడింపకుండ నిర్బంధించుచుండ మీకు మానసులను పరిపూర్ణసత్యవంతులనుగానే తయారు చేయవలె

నను మనోనిశ్చయము మీలో నెంతమందికిగలదు? ధనమే గౌరవములకును పలుకుబడికిని, సత్కారములకును కారణమగు సంఘములో, ధనమే బలవంతుల క్రౌర్యములనుండియు, నిరంకుశత్వమునుండియు రక్షించుతారక మంత్రమైన సంఘములో నైశ్వర్యమును తృణీకరింపగల వారి నెంతమందిని మీరు తయారుచేయగలరు? పవిత్రమైన ప్రేమ, నిష్కృష్టమైన యుద్దేశములు కలిగియున్నను "మానవులను నమ్మవలదు; సత్యసంధులైనవారు ప్రజాహితకార్యములనుండి మరలి యాత్మాభిముఖులు కావలెను; ధర్మము స్వగృహముతో ప్రారంభము కావలెను." అనునవి నీతికరములగు సూత్రములను, (సంఘముయొక్క సామాన్యపరిస్థితులనుబట్టి) మీ యనుంగు బిడ్డలకు బోధింపనివాడు మీ లో నెవడు కలడు? ప్రజలకొరకై చ్ఛికముగా జనిపోయిన జీససునారాధించు మతమును చెందిన స్త్రీయైనను పరోపకారార్థము శ్రమపడ నుద్యమించుపుత్రుని కౌగలించుకొని వారింపని మాత మీలో నిప్పుడు కలదా? ఇది ధర్మము కాదని బోధించు ధైర్యము నీకున్న మాసంఘమంతయు వేయికంఠములతో, వేయిసాదృశ్యములతో నీప్రయత్నమును భంగపరచుచుండును. విషపూరితమై, సంకరమైయున్న వాతావరణములో మీయాత్మలను మీరు పవిత్రమొనర్చి యుద్ధరించుకొనగలరా?

ఇక మీయార్థికపరిస్థితుల విషయమై యందరిస్థితియు బాగుపడిన గాని మీయొక్కరి స్థితియు శాశ్వతముగా బాగు పడునని మీరూహింతురా? ఇచ్చట నింగ్లండులో ప్రతి వత్సరమును కోట్లకొలది పౌనులు తిండి లేక బాధపడు దీనుల ను మనోనిశ్చయము మీలో నెంతమందికి గలదు? దీనుల కొరకు ధర్మముగా ననేకమంది వ్యక్తులు వెచ్చించుచున్నారు; ఐనను ప్రతివత్సరము దరిద్రము హెచ్చుచునే యున్నది; వ్యక్తులకు దానము చేయుట నిరుపయోగమైనది. దానివలన చెడుగు తగ్గుటలేదు. ఇట్టిచెడుగును శాశ్వతముగా నిర్మూలము చేయగల వైద్యమే కావలెను. అన్యాయమైన చట్టములుం డుటచే దేశములో కొద్దివారికిని గొప్పవారికిని, బాధించు వారికిని బాధ్యపడువారికిని పోరు తప్పదు; అట్టితరి వివిధవిశాల వర్తకవాణిజ్యాదిపరిశ్రమలకు వలసినంత ధనము దేశములో బ్రవహింపజాలదు. తన యిచ్చవచ్చినట్లు పన్నులను విధించు చు, నిరంతర నిర్బంధములను కల్పించుచు తమపైతిరుగుబాటు జరుగునేమోయను భయముచే సైన్యమును, గూఢచారులను, ఏజంట్లను, ఫించనుదారులను వృద్ధి చేసికొనుచుండు నిరంకుశ ప్రభుత్వములో పరిశ్రమలు, కళలు, వృద్ధియగుట కల్ల; నీదేశ ములోని ప్రభుత్వమును, నీదేశములోని సాంఘిక పరిస్థితులను, చక్కబరచుకొనిన చాలదాయని మీరడుగవచ్చును! అది చాలదు, ఈదినములో నెవడును కేవలము తన దేశములో

తయారైన వస్తువులతోనే జీవించుట లేదు. మన దేశము లోని వస్తువుల నితర దేశములకు పంపుచు నచ్చటి వస్తువులను మన దేశముకు తెచ్చుకొనుచు జీవించుచున్నాము. కనుక దరిద్రము హెచ్చగుచు నీవస్తువులను కొనలేనివారి సంఖ్య నానాటికి క్షీణించిపోవుచున్న విదేశమువలన నీసరకుల కొక దెబ్బ తగులుటలేదా? నీకొకసంత పడిపోవుటలేదా? అచ్చట నున్న ప్రభుత్వదుండగము చేత నొక విదేశ వర్తకవ్యాపారము కూలిపోయినచో నది మీవర్తకవ్యాపారముకు గూడ తీరని దెబ్బకదా? ఇంగ్లండు, అమెరికాలు దెబ్బ తినువో నదియిట లీకి గూడ తగలక తప్పదు. ఈరోజులలో పరపతియనునది జాతీయసమస్య కాక యూరపు సమస్య యైనది. ఇంతేకాదు. మీరు జాతీయ సంస్కారమును తలపెట్టుడు! అన్ని ప్రభుత్వములును మీపట్ల శత్రుత్వమునే వహించును. ఈరోజులలో సాంఘికసమస్య సర్వత్ర నొక్కటే యని గ్రహించి ఈప్రభుత్వములు తమలో తామిదివరకే యిట్టి యేర్పాటులను గావించుకొనినవి. యూరపు అంతయుసాభ్రాతృత్వమును వహించి సర్వత్రసంస్కారము జరిగి దానిద్వారా మానవలోకము నంతయు సంస్కరింపబడిన గాని ప్రయోజనము లేదు. సోదరులారా! మీధర్మమే కాక మీస్వప్రయోజనము కూడ నిదియే యని మీరు గ్రహించవలెను.మీకుటుంబ ధర్మములను మీజాతీయ ధర్మములను నిర్వహించుటకు పూర్వ

మే మీరీ మానవ ధర్మములను 'నిర్వహింపవలెనని మరువ కుందురుగాక ! భగవంతుని ప్రేమ, శాసనము మానవుల కందరకు నొక్కటి యెట్లగుచున్నదో యట్లే నీవాంఛ నీకృత్యములు మానవలోకము కంతకును చెందుగాక ! నీవే దేశమునకు జెందినవాడవైన నేమి? తన హక్కుకొరకు, న్యాయముకొరకు, సత్యముకొరకు మానవు డెచ్చట పోరుచున్నను సరే ! అతడు నీసోదరుడే ! అధర్మముచే నన్యాయముచే నిరంకుశత్వముచే నత డెచ్చట బాధపడుచున్నను నీసోదరుడే ! స్వతంత్రులు కానిండు ! బానిసలు కానిండు ! మీరందరు సోదరులు. మూలము, ధర్మము, పరమావధి యివి మీకందరకు నొక్కటి ! మీసిద్ధాంతము మీకృత్యములు మీరు పోరుచున్న ధర్మపతాకము—యివికూడ నొక్కటే యగుగాక ! వాని భాషవేరు; మాభాషవేరు అని యనకుడు. బాధలు, కష్టములు, కన్నీరు, కర్మలు, దేశభక్తుల మరణములు—యింతకంటె గొప్పభాష యేది కలదు? ఇదిమానవులకందరకు సామాన్యభాష! ఇది మీకర్థమైనభాష! మానవలోక మతివిశాలమైనది; మనమో! మర్త్యులులము! అనియనవలదు. భగవంతుడు మన శక్తులను గాక మన యుద్దేశములనే ప్రమాణముగా తీసికొనును, మానవలోకమును ప్రేమింపుము, నీదేశమునకు గాని, నీకుటుంబమునకుగాని, నీవొకపనిని చేయునపుడిట్లు ప్రశ్నించుకొనుము. "ఇప్పుడు నేను చేయు

దానినే యందరు నందలకు చేయునెరల నది మానవలోకమునకు హాని చేయునా లేక మేలుచేయునా?" దానివలన కీడు కలుగునని నీయంతఃకరణ చెప్పునో వానిని మానివేయుము. నీకార్యమువలన నీకుటుంభముకో, నీదేశముకో, సంద్యఃఫలితము కలుగునట్లు నీకు గాన్పించి నప్పటికిని మానివేయుము. మానవజాతియంతయు నొక్కటి! జాతులన్నియు సౌభ్రాత్రుగణములోనివి! యను సత్యమునే చాటుము. నేడది శుష్కసిద్ధాంతములోనే కాని యాచరణలో లేదు. ఎచ్చటనైనను సరే! ఏసందర్భములో నైనను సరే! యీవిశ్వాసమునే చాటుము! భగవంతుడుగాని మానవుడుగాని మిమ్మింతకు మించి శాశింపజాలడు. ఇతరులకు చాటజాలకపోయినను నీకు నీవిట్లు చాటుకొనినను మానవలోకముకు మేలు జేసినవాడవే యగుదువు.





లివితేటలను శక్తిసామర్థ్యములనుబట్టి తెలివిగల ఓవరుసీరు యేవిధముగా దేసికిరాగిన వానిని దానికేవినియోగించునో యట్లేభగవంతుడు మానవకోటిని ప్రపంచమంతటను వివిధ తెగలుగా విభజించి జాతీయబీజములను నాటినాడు. నదులు, పర్వతములు మొదలగు నైసర్గిక మర్యాదలను భగవంతుడు కల్పించియుండ ధనకాంక్ష, రాజ్యకాంక్ష మొదలగువానిచే దుష్టప్రభుత్వములు భగవద్విధానమును భగ్నమొనర్చెను. నేడొక్క ఋంగ్లండు, ఫ్రాన్సులుమాత్రమే యిట్టి నైసర్గిక హద్దులను కోల్పోకుండనున్నవి. తమకుటుంబములు, తమవంశాభివృద్ధియను జాత్యహంకారపూరితులై యీదుష్టప్రభుత్వములు ఇతర దేశములను గడ్డిపరకలవలె చూచెను. చూచుచున్నవి. కాని భగవద్విధాన మతి హతమైనది? దుష్టప్రభుత్వములు తెచ్చిపెట్టిన దుర్న్యయ విభాగములు నాశనమై ప్రజలనిజాభావములు విజయము నొందగలవు. యూరపుపటమంతయు పునస్సృష్టినొందును. రాజులును అధికారములను చెలాయించు తరగతులవారును పాలించు దేశములు తారుమారగును; ప్రజలు పరిపాలకులగుదురు. ఈదేశములమధ్య సౌభ్రాతృత్వము సామరస్యము, యేర్పడును. ప్రజాసామాన్యము నుద్ధరించుట. జీవితముయొక్క నిజధర్మమును కనుగొని యాచరణకు దెచ్చుట మొదలగు మానవకృషిసఫలమగును. ఇవి నెమ్మది

గా శక్తుల ననుసరించి క్రమవృద్ధినొందును; స్వాతంత్ర్యముతో నిర్వహింపబడుచుండును. అప్పుడొకేభాష మాట్లాడుచు, నొకేభావములను గలిగి యొకచారిత్రక సాంప్రదాయములచే సంస్కరింపబడి యనేకలక్షల దేశీయుల ప్రేమానురాగముల చేతను. సహాయముచేతను ననంతబలమును సంపాదించి మీరుమీస్వప్రయత్నములచే మానవలోకమునకు కళ్యాణము నొనగూర్పవచ్చును.

ఇటలీలోజన్మించినమీరు పక్షపాతమువహించినట్లు భగవంతుడు యూరపులో చక్కనిప్రదేశము నిచ్చియున్నాడు భగవంతుడు మీదేశమునకు దివ్యమైన వివాదకవకాశములేని సరిహద్దులను ప్రసాదించినాడు. ఒకప్రక్క యూరపులోకెల్ల నెత్తైన ఆల్ప్సుపర్వతశ్రేణులుమరియొకప్రక్క నగాధసముద్రము యూరపు పటమును తీసికొనుడు; ఇటలీలో నుత్తరమున నున్న పార్మావద్ద కంపసు యొక్క యొక కొననుంచి రెండవ కొనను వార్‌నదీ ముఖమునుంచి ఆల్ప్సువైపు కర్ధచంద్రాకారముగా గీయుడు. ఇసాంజోనదీ ముఖము దగ్గిర నర్ధవృత్తము పూర్తియగును. దీనినే భగవంతుడు మీకు సరిహద్దుగా నేర్పరచినాడు. ఈసరిహద్దువరకు మీభాషయే కలదు. దీనిని దాటుటకు మీకు హక్కులేదు. సిసిలీ, సార్డినియా, కార్సికాలును వాని కివి యిటలీకిని మధ్యనున్న చిన్న

దీవ్రలును మీవి యనుట కెట్టి సందేహమును లేదు. వీనికొ రకు పశుబలోన్మత్తులై మీతో నెవ్వరేని కొద్దికాలము పోరిన పోరవచ్చును; కాని చిరకాలమునుండి యీసరిహద్దు లు ప్రజలందరిచేతను నంగీకరింపబడినవి. మీరందరును లేచి కడగొట్టి ప్రయత్నమును గావించి యీసరిహద్దులలో మీ త్రివర్ణ చిత్రధ్వజమును స్థాపింతురేని యూరపు యంతయు పునరభ్యుదయమునొందిన యిటలీని జయజయ ధ్వానముల తో బహూకరించుచు జాతి సమితిలోనికి దీసికొనును. దీని కొరకే మీరు సమస్త ప్రయత్నములను గావింపవలెను. మీకు దేశములేనిచో పేరు ప్రతిష్ఠలుగాని హక్కులుగాని చిహ్నముగాని, పలుకుబడిగాని, ప్రపంచప్రజలలో తోడి సోదరులవలె నంగీకరింపబడుట కధికారముగాని యుండదు; మీరు మానవలోకముకు చెడబుట్టిన వారగుదురు. మీ లోకధ్వజములేని యోధులవలె, జాతులలో నిజ్యైలుజాతి వలెనుందురు. మీకొక విశ్వాసముగాని యొకరక్షణము గాని యుండనేరదు; మీకెవరును జామీనుదార్లుగా నుం డరు. మొదట మీరొక దేశమును జయించుకొనినగాని మీలోనున్న యక్రమసాంఘిక పరిస్థితులనుండి మీకు మో క్షము గలుగునని యెన్నడును భ్రమచెందకుందురు గాక! ఒక దేశములేనిచోట మీకొక సామాన్య ధర్మమేమి యుం డును? అపుడు స్వప్రయోజనమే రాజ్యము చేయును. అం

దరి ప్రయోజనములను రక్షించున దేదియు లేదు కనుక బల వంతుని ప్రయోజనమే యీడేరును. మొదట జాతీయ సమస్య చక్కబడనిదే మీ యైశ్వర్యము చక్కబడునని మె న్నడును తలంపకుడు. అదికల్ల. అసంభవము. మీ పారిశ్రా మిక సంఘములు, మీ పరస్పర సహాయక సంఘములు మీ కో మంచి శిక్షణమును, సంస్కారమును కలుగ జేయు సాధ నములే యగుచున్నవి. కాని మీ కొక యిటలీయున్నగాని యార్థికముగా నివి నిరుపయోగములు ఆర్థిక సమస్యకు ప్ర ధానము ఉత్పత్తి, ధనము; ఈ రెండును యభివృద్ధి నొందవలె ను. మీ దేశము ముక్కముక్కలుగా విభజింపబడి సుంకము లు మొదలగు ననేక కృత్రిమావరోధములు కల్పింపబడి మీ సరకుల నమ్ముకొను సంత లరికట్టబడుచున్నవి. ఇవివృద్ధియగు ట కవకాశము లు లేవు. నేడు మీకు యిటలీలో స్థానము లేదు మీరు కార్మికులని పిలువబడజాలరు; అందులో మీ కొక శక లము లై మీరు బూనుకొనిన ఘనకార్య నిర్వాహణమున కసమర్థులై యున్నారు ఇటలీలో (రోము రాజధాని గా గలిగి) జాతీయ ప్రభుత్వము స్థాపింపబడవలెను; కాలపరిస్థితులను గమనించుచు నిటలీని యభివృద్ధికి గొంపోవు కొన్ని సిద్ధాంత ములను ప్రకటించవలెను; పరిశ్రమ పవిత్రమైనది; ఇటలీ యైశ్వర్యమున కదియే మూలాధారము అను సూత్ర మంగీ కరింపబడి నపుడే మీ మోక్షము ప్రారంభము కాగలదు.

కనుక నిప్పటి పంస్థితులలో మీ వైశ్వర్యాభివృద్ధియను వది కల్ల అల్ప్సు మొదలు సిసిలీవరకును విస్తరించిన సర్వ సంపద్భాయిష్టమైన యిటలీయే మీ యాశయముల నీడేర్చ గలదు. మీ ధర్మమును శిరసావహించినపుడే మీరు హక్కులను సాధింపగలరు. మీ ర్త్వాతను సంపాదించుకొనుడు! హక్కులు మీకు కరతలామలకమగును. సోదరులారా! మీ దేశమును ప్రేమించుడు! మన దేశమే మనగృహము; మనకు దానిని భగవంతుడు ప్రసాదించినాడు ఒక విశాలమైన కుటుంబము; ఒకరినొకరు ప్రేమించుకొనుట ప్రేమింపబడుట; భావములచేతను, సాంప్రదాయములచేతను నొకప్రదేశమునే లక్ష్యముగా గలిగియుండుటచేతను, ప్రకృతి ధర్మములచేతను నొక ప్రత్యేక కార్యనిర్వాహణమునకు నియోగింపబడుట:— ఇదియే భగవద్విధానము. మనదేశమే మనరంగస్థలము. మనకృషివలన తయారగు వస్తుసామగ్రి ప్రపంచములో నన్ని చోట్లకును పోవలెను. కాని మన కృషికి కావలసిన ముఖ్యమైన, పటుతరమైన పరికరములన్నియు మనదేశములోనే యున్నవి మనము వానిని తృణీకరించుచో మన బలమును గోల్పోవుటే కాక భగవంతునిపట్ల కృతఘ్నుల మగుదుము. యదార్థసూత్రముల ననుసరించి మనదేశముకొరకు పాటు పడుట మానవలోకముకొరకు పాటు పడుటయే యగును. ప్రపంచ కళ్యాణమును గూర్చుటకు మనదేశ మొక బీజము

వంటిది. దీనిని మనము తిరస్కరించుచో మన దేశమునకును మానవలోకమునకును గూడ మనము వ్యర్థులమగుదుము. మానవలోకమును గూర్చు జాతులలో జేరుటకు పూర్వము మనమొక జాతి కావలెను. సమానులమధ్యనే సాభ్రాతృత్వముండును. లేనిచో మనకు నామరూపములుండవు.

మానవలోకము పటుతరవిరోధశ్రేణిమధ్య నొక తెలియని దేశమును జయించుట కుపక్రమించిన సైన్యమువంటిది. వివిధదేశప్రజలా సైన్యముయొక్క వివిధశాఖలు; శ్రేణులు. ఒక్కొక్క ప్రజకొక్కొక్క ప్రత్యేకస్థానము. ప్రత్యేక ధర్మము కలదు. ఈవివిధ ధర్మముల సక్రమనిర్వాహణముమీదనే యందరిజయము నిశ్చయింపబడుచున్నది. ఈయుద్ధక్రమమును చెడగొట్టవద్దు! భగవంతుడు మీకర్పించిన ధ్వజమును విడనాడవలదు! నీవెక్కడనున్నను, పరిస్థితులచే నీవే ప్రజల మధ్యకు తరుమగొట్టబడినను వారిస్వాతంత్ర్యముకొరకు పోరాడుము. నీకే గాక నీదేశమునకు గూడ గౌరవమును ప్రేమను సంపాదించునట్లు యిటలీదేశస్థునివలె పోరాడుము. నీయాత్మ యెప్పుడును యిటలీనే ధ్యానించునుగాక! నీజీవితకలాపమంతయు నిటలీగౌరవమునకు వన్నె దెచ్చునుగాక! మానవలోకము కొరకు పోరునపుడు నీవు యిటలీధ్వజముక్రిందనే పోరాడుము. 'నేను, అని యనకుము. 'మేము, అనియే వచించుచుండుము. మీలో ప్రతివాడును మూర్తిభవించిన యిటలీయో యను

నట్లు గర్వించుడు. మీతోడి దేశీయునికొరకు పరితపించుడు. మానవులు మీద్వారా మీదేశమును గౌరవ ప్రేమలతో జూచునట్లు మీక్రియాకలాపమును పునీతము గావించు కొనుడు.

మీదేశ మొక సమగ్రప్రదేశము. దానిని చీల్చివేయ రాదు ఒక కుటుంబములో నొకడు విదేశవాసము ననుభ వించుచుండ కుటుంబములోని మిగత వారందరు నెట్లు సుఖ ముగా విందుల నారగించుచు నుండజాలరో యట్లే మీభాష మాట్లాడు నొక ప్రదేశము ఇటలీనుండి చీల్చివేయబడినంత కాలము మీరును సుఖమును శాంతిని పొందియుండరాదు. భగవంతుడు మీకీమానవలోకములో నిర్వహింపవలసిన ధర్మమును చాటినాడు. మీదేశము దాని సిద్ధికొకసాధన. దానిపుత్రులయందరి శక్తులు నందరిబలమును యీధర్మమును నెరవేర్చుట కేకము కావలెను. నీవెవరవు? అని ప్రశ్నించి నపుడు 'నేను యిటలీదేశస్థుడను, అను జబాబుచే ప్రతివాని కిని గొన్ని సామాన్యధర్మములును హక్కులును కలవు. మీ యందరిచే నెన్నుకొనబడిన ప్రభుత్వ మొక్కటే యీధర్మము లకును, హక్కులకును యదార్థమైన ప్రతినిధి. కనుక నొక దేశమున నొక్కటే ప్రభుత్వముండవలెను. ఇటలీలోనే యనేక ప్రభుత్వములు సోదరప్రభుత్వములవలె నుండవచ్చు నని వాదించువారు సమగ్రత, యేకత్వము అను భావమును

గ్రహించక దేశమును ముక్కముక్కలుగా చీల్చవేయుమందురు. నేను యిటలీని విభజించు వివిధప్రభుత్వములను మనప్రజలు సృష్టించలేదు దేశములోని సంస్థానాధీశ్వరుల యొక్కయు విదేశప్రభుత్వముల యొక్కయు స్వలాభము, అధికారకాంక్ష యిట్లు పరిణమించును

స్వతంత్రులును, సమానులును నొకే పరమావధికొరకు సౌభ్రాత్రుత్వముతో పాటుపడుచు సాహచర్యము ననుభవించు ప్రదేశమునకే దేశమనిపేరు; మీరు దీనిని గ్రహించి యీస్థితిని కాపాడవలెను. దేశమనగా నొకగుంపుకాదు; అది యొక సంఘము; సాహచర్యము. సర్వజనులకును వర్తించు హక్కులేని దేశము నిజమైన దేశమేకాదు. కులముగాని, ప్రత్యేకాధికారములుగాని, యెక్కువతక్కువ యను నీచ సాంప్రదాయముగాని యిట్టి సార్వజనీనమైన హక్కును తొలగించిన దేశము నిజమైన దేశముకాదు. ప్రజాసామాన్యము యొక్క యధికారములవలెనుగాని శక్తులనుగాని యణగద్రొక్కిన దేశము లేక నిద్రింపజేసిన దేశము నిజమైన దేశము కాదు. ఒక సార్వజనీనసూత్రము నామోదించి గుర్తించి దాని యభివృద్ధికి పాటుపడనిదేశము నిజమైనదేశముకాదు; దానిని నొకజాతి యొక్క ప్రజయని పిలువరాదు. అదికొన్ని విపరీత పరిస్థితులచే నొకచోట జేరి మరికొన్ని పరిస్థితులచే చెదరిపోవు గుంపు నీదేశములో బయలుదేరిన ప్రతియన్యాయ

మును హెచ్చుతగ్గును ప్రత్యేకాధికారమును నిర్భయముగా చివర వరకును నీ దేశముపేర పోరాడుటే నీధర్మము ఒక్క-ధీశక్తికి మాత్రము ప్రాముఖ్యత కలదు. గుణముతో గూడిన ధీవిశేషమునకు న్యాయమైన యధికారము కలదు. అది భగవత్ప్రసాదితము గాని మానవుడిచ్చునది కాదు, మీరు దానిని నంగీకరించి దానియాజ్ఞలను శిరసావహించుచున్నారు. మీ యంతట మీరు స్వేచ్ఛగా నాలోచించుకొని మీబుద్ధి ననుసరించియే మీరట్లు చేయుచున్నారు. అట్లు కాక బలిమి లేక సాంప్రదాయముచేతనో మిమ్మణచుచుండు నధికారము, అందరకును లేని ప్రత్యేకాధికారము, నిరంకుశత్వమువంటిది; దోపిడీవంటిది; మీరు దానితో డీకొని దానిని రూపు మాపవలెను. మీ దేశము మీకొక దేవతాయతనము వంటిది. సర్వసములయిన ప్రజాగణము దీనికి పునాది; భగవంతుడు శిఖరము. మీ దేశగౌరవమును, మీగౌరవమును వాంఛింతురేని మీరింతకన్న వేరు నీతిని, వేరు సిద్ధాంతములను నంగీకరింపకుందురు గాక! ఈయుత్తమన్యాయమును క్రమక్రమముగా నాచరణకు దెచ్చునట్టి యితరన్యాయములే మీస్థితిని దోహదముచేయును గాక!

ఇట్టిన్యాయములుండవలెనన్న వీని నందరును కలిసియే తయారు చేయు టత్యవసరము. దేశములో నొక్క- తరగతి వారే చేయు చట్టములు ఆతరగతి వారి భావములను ఆశయ

ములను కోరికలను మాత్రమే విశదము చేయును. చట్టమందరి యాశయములను వెలిబుచ్చవలెను. అందరి కళ్యాణమును చేకూర్చవలెను; జాతీయహృదయమును ప్రతిధ్వనింపజేయవలెను. కనుక ప్రత్యక్షముగనో యప్రత్యక్షముగనో జాతియంతయు శాసనకర్తలుగా నుండవలెను. ఈధర్మమును మీరే కొద్దిమందికో విడిచివేసినయెడల నన్నితరగతులును కలిసిన దేశముకు బదులు మీరొక తరగతియొక్క యహంకారమును స్వార్థపరత్వమును మాత్రమే పెంచుచుందురు. దేశమనగా నొక ప్రాంతము మాత్రమే కాదు. ప్రాంతమొక పునాదివంటిది. దేశమా పునాదిపై నిర్మింపబడు భవనము. అదియాప్రాంతమున నివసించువారి నందరను ప్రేమ సాహచర్యములచే బంధించు నొక యమోఘశక్తి జాతీయజీవితాభివృద్ధిలో మీసోదరులలో నొక్కనికైనను యెన్నికాధికారము మూలమున ప్రాతినిధ్యము లేకపోయినను, మీలో నొక్కడైనను విద్యాగంధము లేనివాడున్నను, మీలో శక్తి గలిగి పని చేయ నిచ్ఛగించువాడు పని లేక దరిద్రముచే బాధ పడుచున్నను మీదేశముయదార్థమయినదేశము (అందరియొక్కయు, అందరికొరకు నైనది) కానేరదు. ఎన్నికాధికారము, విద్య. కృషి, యీమూడును జాతికి ప్రధానమూలములు—యీమూడును శాశ్వతముగా నాటుకొనువరకును మీరు శాంతింపరాదు. ఇవి శాశ్వతముగా నాటుకొనిన పిదప ననగా మీలో ప్రతివానికిని శరీరయాత్మా

భివృద్ధులకు తగిన పోషణ మేర్పడిన తరువాత దక్షిణహస్త ములతో మాత నాశ్లేషించు బిడ్డలవలె మీరు స్వేచ్ఛాను వర్తులయి నిష్కల్మష నిర్విచార మనసులతో మీసర్వశక్తుల వృద్ధిచేసుకొనుచు నిటలీధర్మమును నెరవేర్చవచ్చును, యూర పునంతను నైతికముగా నేకము చేయుటే యిటలీయొక్క ధర్మము. జాతులన్నియు భిన్నభిన్నమయి యున్నతరి యిటలీ రెండుసారు లైకమత్యశంఖారావము నపూరించును. యూరపు కంతకును రోము రెండుసార్లు రాజధాని యయ్యెను. మొదట మనజాతీయజండాలుజయ జయ ధ్వానములతో యూరపు నం తను ముట్టడించి నాగరిక సంస్థల నెల్లెడలను నిర్మించి యైక్యత ను జేకూర్చెను. రెండవసారి పోపులను మతాధికారులద్వార క్రైస్తవ ప్రపంచమంతకు నాత్మైక్యతను బోధించెను. నేడు ఇటలీ మూడవధర్మమును ప్రబోధింప వలసియున్నది. ఈధర్మ సూచనలప్పుడే యూరపును కదల్చివేయుచున్నవి; జాతులన్ని యు తమ దృష్టిని, మనస్సును ఇటలీ వైపుకు త్రిప్పి చూచు చున్నవి.—

ఇట్టిమహోత్కృష్ట ధర్మమునకు తగినట్లుగానే మీ రు మీదేశముపట్ల మీధర్మములను నెరవేర్చవలసియున్నది. స్వార్థము, అసత్యము రాజనీతి యను వానిచే నీధర్మము పవిత్రముగా నుండను గాక ఇక ముందు మన దే శప్రభుత్వ మిప్పటివలె స్వప్రయోజనము, అవకాశములను

సూత్రములపై గాక మీ సౌందరి కృషి వలనను యదార్థమైన సూత్రముల మీదనే స్థాపింప బడగలదు. యూరపులో కొన్ని దేశములలో స్వాతంత్ర్య మాంతరంగికమున పలితమైనది. ఇతరుల విషయమున దానికి స్వస్తి చెప్పబడుచుండును. సత్యము వేరు దాని ప్రయోగము వేరు; సిద్ధాంతము వేరు ఆచరణ వేరు అను వారు కలరు వారిట్టి తప్పు గావించినందులకు చాలకాలమే కాంతవాసమును, నిరంకుశత్వమును, అరాజకమును ననుభవింపక తప్పదు. కానిమున ఇటలీ ధర్మమును గుర్తెరిగితిమి కనుక నున మిట్టి మార్గము నవలంబింపము. భగవంతుడొక్కడే యున్నట్లే ఇటలీ యొక్కటే సత్యమును. నొక్కటే విశ్వాసమును నొక్కటే రాజకీయ జీవితసూత్రమును కలిగియుండును. ఇట్టి పునాదులపైన ప్రపంచజాతులన్నియు చూచునట్లు మీరు స్వాతంత్ర్య సౌభ్రాతృత్వధ్వజమును లేవనెత్తి నిరంకుశుల బెదిరింపులకు గాని తాత్కాలిక లాభములకు గాని దానిని దింపకుందురు గాక! మీరు మీ విశ్వాసములతో పాటు ధైర్య స్థైర్యములను చేబట్టుడు ఇటలీ హృదంతరాళమున నాట్యము చేయుభావముల ప్రపంచమునకును దానికంతకును ప్రభువులమని దంభములు కొట్టి వారికివి యెలుగెత్తి చాటుడు! మీ తోడిజాతులను మీవలెనే చూచు

కొనుడు. మీద్వారా జాతీయ జీవితము సత్త్వబలారోగ్యములచే శోభించుచు సందేహ, భయములను కంటకములను ఛేదించును గాక! ప్రజలు పునాదిగను, సిద్ధాంతములను సరిగా నన్వయింతు కొనుచు నాచరణకు బెట్టుటే సూత్రమును నందరి బలమే జాతీయ బలముగను, సౌఖ్యమే తత్ఫలితముగను, భగవదర్పితమైన ధర్మ నిర్వహణమే దాని పరమావధిగను నుండును. గాక! మీరు! మానవలోకము కొరకే మీ ప్రాణముల నర్పింప నండుటచే మీ దేశ జీవిత మమృతమగును.



# కుటుంబము పట్ల ధర్మములు



ఆఱవ ప్రకరణము



కుటుంబము హృదయముయొక్క, ప్రేమయొక్క నివాసస్థానము. తన యద్భుత శోభచేతను మార్ధవ ప్రేమాతిశయముల చేతను మీధర్మ నిర్వాహణమును తేలికగను మీవిచారమును ముదావహముగను మార్చివేయునట్టి దేవి మీకుటుంబములో కలదు. ఈప్రపంచములో మానవుడు నిర్విచారముగా ననుభవింపగలిగిన పవిత్రానంద మొక్క కుటుంబానందమే! ఈగృహాధి దేవతరక్షణక్రిందప్రశాంతమైన కుటుంబ జీవితమునే దురదృష్ట వంతు డనుభవింప జాలడో యతని యాత్మ విచార కలుషితమగును; అతని హృదయమున దుష్పూరమైన శూన్యత యేర్పడును. నేనే దీనికి సాదృశ్యముగ నున్నాను. కుటుంబానందమును శాంతిని యనుభవించుచున్న సోదరులారా ! ఈదేవతను సృష్టించిన భగవంతుని కీర్తింపుడు! ఈయానందమును చులకన చేయకుడు! ఇంతకన్న నెక్కుడు యానందము, శాంతి మరియొక చోట లభ్యమగునని యువ్విళూరకుడు నీకెక్కడను లభించజాలనట్టి గుణము

స్థిరత్వము యిక్కడనే గలదు. మహీరుహమును లతాంతము పెనగొని యుండునట్లే యానందాతిశయము నీకు తెలియకుండగనే నీచుట్టును పెనగొని యుండును. అది ప్రతిక్షణము నిన్ననుసరించుచు నీజీవితముతో నైక్యత నొందును. అది నీలో నొకభాగమై పోవుటచే నీవు దానిని తరుచు కనుగొనలేకపోవచ్చును; కాని యది పోయినపు డనిర్వచనీయమైనదేదియో, నీస్థితికి, నీజీవితమునకు ముఖ్యమైన దేదియో పోయినట్లు నీవనుభవించెదవు; శాంతి, సౌఖ్యములు నశించి నీవు మతిచెడినవానివలె నుందువు; అప్పుడప్పుడు నీకు స్వల్పసుఖము కొద్దిశాంతి కలుగవచ్చును. కాని కాసారోపరిభాగమున తరంగము లనుభవించు శాంతి! తల్లి యురమున శిశువును జోలపాటలతో • జోకొట్టుశాంతి! ఆనిర్మలానందము నీకు కలుగనేరదు.

స్త్రీయే యీగృహదేవత! గృహలక్ష్మి! తల్లి, భార్య సోదరి! ఆహా! స్త్రీజీవితమున కెట్టి పట్టుకొమ్మ! సమస్తవిచారములను! తనప్రేమాతిశయములచే బోద్రోలు చింతామణి; మానవలోకమునంతను సంరక్షించుచున్న దైవమునొక్క ప్రతిబింబమువంటిది. ఆమె మన ప్రతిబింబను తొలగింపగల నిక్షేపమువంటిది. మన యందర నుగ్గుపాలతో పెంచి భావిదశను కల్పించిన దామెయే! తల్లి మొదటిముద్దు శిశువునకు ప్రేమను బోధించుచున్నది. తను ప్రేమించిన యన్నులమిన్న

యొక్క తొలి పవిత్రచుంబనమే మానవునకు జీవితాశను, విశ్వాసమును పురిగొల్పుచున్నది; ఈవిశ్వాస ప్రేమలనుండియే పూర్ణత్వమును బొందవలెననెడి కోరికయు తత్సిద్ధిని క్రమాను గతముగా బొందుటకు తగుశక్తియు నుద్భవమగుచున్నవి; మనలను ముందు సంతతివారితో కలుపునట్టి చిహ్నమైన శిశు రూపమున నివి భవిష్యత్తును సృష్టించుకొనుచున్నవి. ఆమె ద్వారా గృహము (తనయునృత పునస్సృష్టివలన) యనంత మును సూచించుచున్నది.

కనుక సోదరులారా ! గృహము పవిత్రమైనదని గ్రహించుడు. జీవితము కడి ప్రాణతుల్యమని చాటుడు ! వెర్రి మొర్రి వేదాంతములు తలకెక్కిన వారు చేయువాదములను విశ్వసింపకుడు; సామాన్యముగా గృహము స్వార్థములకును, కులతత్త్వములకును నిలయమగుటను చూచి క్రుద్ధులై యడవి జాతివారివలె దానిని నాశముగావించుటేయుపాయమని చెప్పు హాస్వదృష్టుల మాటలను గమనింపకుడు. గృహము భగవ న్నిర్మితముగాని మానవ నిర్మితముగాదు; మానవ మాత్రులు దానిని నాశము చేయజాలరు; దేశమువలెనే (అంతకంటె యెక్కువగకూడ) గృహము జీవితమునకొక ప్రాణమువంటిది దేశముకన్నకూడ ముఖ్యమని చెప్పియుంటిని. నేను పవిత్రమైన దేశము మానవలోకముయొక్క నైతిక ధర్మములను ప్రతి వాదును తనలో దానవగతము చేసికొనిననాడు, న్యాయము

కావచ్చును. కాని మానవు డున్నంత కాలము గృహము ండి తీరును. అది మానవలోకమున కుయ్యాలవంటిది. మానవజీవితములోని ప్రతిహాంశమువలెనే యిదియు నభివృద్ధి చెందు చుండవలెను, దీని యాశయములు భావములు దృక్పథము నానాటి కభివృద్ధి చెందుచుండవలెనే కాని దీని నెవరును పీకివేయరాదు.

గృహము నంతకంతకు పవిత్రవంతము చేయుచు దేశముతో నన్వయింపచేయుచుండుటే యీధర్మము మానవలోకముకు దేశమెట్టిదో దేశముకు గృహమట్టిదియే! మానవులకు విద్యను, సంస్కారమును గరపుటే దేశము యొక్క విధియని నేను చెప్పియుంటిని; అట్లే నాగరికులకు తగు విద్య నొసగుటే గృహధర్మము గృహము, దేశము:—యీరెంటు నొక సరళరేఖయొక్క యాద్యంతములు ఇట్లు కానిచో స్వార్థభూయిష్టమై గృహము పవిత్రప్రేమను యదార్థ ప్రయోజనము నుండి మరలించి కళంకము నొందిన కొలది దుస్సహమై పశుత్వము లోనికి దిగును.

నేడు పరిస్థితులయొత్తిడివలన గృహములో స్వార్థపరత్వ మెక్కువగా రాజ్యము చేయుచున్నది, దుష్టసాంఘిక సంస్థాపనలు దీనికి దోహదమునిచ్చుచున్నవి. గూఢచారులు, పోలీసులు, ఖయిదు, యురులు మొదలగు వాని ప్రభావముపై నాధారపడు సంఘముల' తన చిన్ని కుమారుని ప్రతియుదారాశ

యమునకును భయపడుచు, వణకుచు తల్లి కుమారు నిక విశ్వాసమునే బోధించక తప్పదుకదా! "జాగరూకుడవై యుండుము! దేశము, స్వాతంత్ర్యము, భవిష్యత్తు అని బోధించువాడు ద్రోహి! నిన్ను ప్రేమతో నాలింగనము చేసికొనువాడు ద్రోహికాని మరియొకడు కాడు." అని యామె బోధించును. ధనమొక్కటే యధికారమునకు ప్రాణమాన రక్షణమునకు, హింసా అధర్మములనుండి కాపాడుకొనుటకు శరణ్యమైన సంఘములో గుణము యుపద్రవకరముగా భావింపబడు సంఘములో సత్యము కొరకు పరితపించు కుమారుని జూచి యనురాగాన్వితుడై తండ్రి యిట్లు బోధించును. "జాగరూకుడవై యుండుము! ఐశ్వర్యములోనే నీ శ్రేయస్సు కలదు. అధికారుల బారినుండియు నీతోడివారి యవినీతి నుండియు నిన్ను సత్యమొక్కటే రక్షింపజాలదు."

కాని మీరు మీ నెత్తురు చిమ్మి మీ చెమట లూడ్చి మీ సోదరుల కొనర్చిన శ్రేయస్సుపైనను మీ గుణముపైనను మీ పుత్రుల కొరకు స్వతంత్రప్రజలతో గూడిన దేశమును స్థాపించిన నాటి కాలమును గురించియే నేను మాట్లాడుచున్నాను. అంతవరకు మీ యభివృద్ధి కొక్కటే మార్గముగలదు మీరు నిర్వహింపవలసిన ధర్మమొక్కటే కలదు. సర్వసిద్ధులై సరియైన కాలమును చూచుకొని విప్లవము ద్వారా మీ యిట లీని మీరు జయించుకొనవలెను. అప్పుడే మీరు పలువిధ

ములగు నాటంకములను దాటి మీయితర ధర్మములను సాధింపగలుగుదురు. అప్పుడు (బహుశః నేను భూస్థాపితమైన తరువాత) మరల మీరీ పత్రములను చదువుకొనవచ్చును. ఇందున్న మిత్రవాక్యములు మీ సోదరుడు నిండు హృదయముతో సంపూర్ణప్రేమతో పరిపూర్ణ విశ్వాసముతో పలికిన పలుకులని గ్రహింతురుగాక !

స్త్రీని ప్రేమింపుడు ! గౌరవింపుడు ! ఆమెనుండి యొక్క మనశ్శాంతినే గాక శక్తిని, ప్రబోధమున, నైతిక, విజ్ఞానసంపత్తులను చూరగొనుడు. ఆమెకన్న నధికుడనను భావమును నీమనస్సునుండి యూడబెరుకుము ! నీకట్టి యాధిక్యత యెంతమాత్రమును లేదు. ఒకవిధమైన దురభిప్రాయము యుగయుగములనుండి వచ్చుచున్నది. స్త్రీపురుషులకు సమానమైన విద్యనొసంగక, స్త్రీల నణచివేయునట్టి చట్టములే నిరంతరము కల్పింపబడినవి. ఇందుచే నిప్పుడు పైకికాన్పించుచున్న స్త్రీల జ్ఞానదౌర్బల్య మేర్పడినది. దీనిని యాతముగాగొని మీరు మీనిరంకుశత్వమును సమర్థించుకొన చూచుచున్నారు. నిరంకుశులెప్పుడు నిట్లే తమ నిరంకుశత్వమును సమర్థించు కొనుటకు తమచేతనే సృష్టింపబడిన యొకదుర్బలత్వమును చూపుచుందురను సంగతి నిరంకుశ చరిత్ర మీకు చాటుటలేదా? ఇది మీ సృష్టికాదా ! ప్రజాసంతతి వా

నైన మీకు విద్యాగంధము లేకుండ స్థానాధీశులు మొన్న మొన్నటివరకును నిరోధించిరి.

ఎన్నుకొనుటకును, చట్టములను గావించుకొనుటకును నాగరిక, సాంఘిక ధర్మములను నెరవేర్చుటకును, విద్యలేని వారగుటచే మీరు పనికిరారని నేడుకూడ వారు వాదించుట లేదా? అమెరికాలోనున్న నీగ్రో యజమానులు నీగ్రోజాతి నీచులని విద్యార్హతలేని వారని చాటుచు వారికి విద్యనొసంగ ప్రయత్నించు వారిని శిక్షించుచుందురు. మనలను పాలించుచుండిన ప్రభుత్వ సంతతివారు మనను యిటాలియనలము, స్వాతంత్ర్యమున కనర్హులమని చాటిరి. ఈలోపున చట్టములచేతను, జీతబత్తెములతో స్థాపించిన సైన్యములయొక్క పశుబలముచేతను మనంతమనమే మన దుర్బలత్వమును పోగొట్టుకొను మార్గముల నన్నిటిని బంధించిరి. నిరంకుశత్వ మెప్పుడైనను స్వాతంత్ర్యమును ప్రసాదించు విద్యావిధానము కాగలదు?

ఇట్లే మన మందరమును స్త్రీల విషయములో నొక యపరాధమును గావించితిమి; గావించుచున్నాము. ఇట్టి యపరాధమును మీదరికి జేరనీయకుడు. మానవకుటుంబమును రెండు తరగతులుగా విభజించి యొక తరగతిక్రింద మరి యొక తరగతి పడియుండవలెననుట కంటె భగవంతుని దృష్టిలో వేరొక యపరాధము గాన్పించదు. భగవంతుని ముందర

నా జగద్ధాతముందర స్త్రీ పురుషులను విభేదము లేదు; అతనికి గాన్పించునది మానవ స్వరూపము. స్త్రీ రూపము గానిండు, పురుషరూపము గానిండు పశుస్వభావము మారి మానవ స్వభావము నుండవలసిన గుణగణము లున్నవా యనునదే ప్రశ్న! సాంఘికస్వభావము, విద్య లేక సంస్కారార్హత, యభివృద్ధి నొందగల శక్తి:—యివియే మానవ స్వభావములు ఈగుణములున్న చోటనే మానవస్వభావము గాన్పించును. కనుక నచ్చట సమానమైన హక్కులు, సమానమైన ధర్మములు కలవు. ఒక చెట్టునుండి రెండు కొమ్మలు విడివడునట్లు మానవలోకమునుండి స్త్రీ పురుషరూపములు జనించుచున్నవి; వారిలో నసమాన ప్రతిపత్తి యేమియు లేదు. ఇద్దరు పురుషులలో తరుచుగా స్వభావములలోను, చిత్తవృత్తులలోను భేదమును గాంచుచుందుము. అట్టి భేదమే మీకిచ్చటను గాన్పించవచ్చును. ఒకే జాతియొక్క వివిధస్వరములలో నెక్కువ తక్కువలు గలవా? వానిలో భిన్నప్రకృతి కలదా? స్త్రీపురుషులిరువురును రెండు స్వరములు, ఇవి లేనిదే మానవజంత్రమే యుండ నేరదు. ఇద్దరు మనుష్యులను తీసికొనుడు; అందులో నొకడు తన కున్న ప్రత్యేక పరిస్థితులవలనను, సహజప్రతాపమువలనను దేశాంతరములందు వసతులను నిర్మించి మానవ సౌభ్రాతృత్వమును చాటుచుండును; రెండవవాడు శిల్పమందును, సాహిత్యమందును జగద్విఖ్యాతి నొందిన చాతుర్య

కమును జూపి దానినే విశదీకరించుచుండును. వీరి సామాన్య ధర్మములలోన; హక్కులలోను భేదమేమి కలదు? ఈ యిద్దరును కూడ నొక దివ్యాశయమునే బుద్ధి పూర్వకముగనో యబుద్ధిపూర్వకముగనో బోధించుచున్నారు; వారి ధర్మమందిరు వురును సములే! సోదరులే! స్త్రీ పురుషులా యిరువురి వలె మానవలోకములో వేరువేరు ధర్మములను కలిగియున్నారు. కాని యవి రెండును సమానపవిత్రతనే కలిగియున్నవి; రెండును సామాన్యాభివృద్ధి కవసరములే! కనుక స్త్రీ మీ విచారములలోను మీయానందములోన సమభాగిని; తోడు నీడ మాత్రమే కాక మీ భావములలోను, మీయాశయముల లోను, మీ యధ్యయనములలోన, మీ సాంఘికోద్ధరణ ప్రయత్నములలోను యీయుస్థితియందునను గూడ నామె సహధర్మచారిణియే యని గ్రహింతురు గాక! నాగరిక, రాజకీయజీవితములలో నామె నీకు సమానురాలు. మానవాత్మకు మీరిరువురును రెండురెక్కలవంటివారు, ఇవియే మిమ్ము పరమావధికి గొంపోగలవు. ‘భగవంతుడు పురుషుని సృష్టించెను. అతనినుండి స్త్రీని సృష్టించెను.’, అని మోసెసుయొక్క బైబిలు చెప్పుచున్నది కాని మీ బైబిలు, భవిష్యత్తు బైబిలు యిట్లు చెప్పవలెను. “భగవంతుడు స్త్రీపురుష రూపమున నున్న మానవలోకమును సృష్టించెను.”

భగవద్దత్తమైన మీబిడ్డలను ప్రేమింపుడు ! కాని మీరు యదార్థమైన యుదారమై కరుకుదనముతో కూడిన ప్రేమనే చూపవలెను. గాని దిట్టతనములేని యర్థములేని గుడ్డి మోహమును చూపరాదు; అది మీకు స్వార్థమును వారికి వినాశమును దెచ్చిపెట్టును భవిష్యత్సంతతి యభివృద్ధియంతయు మీచేతులలో నుంచబడిన సంగతి మరువకుడు; ఇట్లు మీ కొసంగబడిన సంతతిపట్ల మానవలోకముపట్ల భగవంతు నిముందర మీరొకయద్భుత బాధ్యతను నెరవేర్చవలసియున్నారు. మీరు వారిని భోగపరాయణులను ధనపిపాసులనుగా తయారు చేయక జీవితముయొక్క ధర్మములను, దానిని పాలించునైతిక శాసనములను గుర్తించు వారినిగను తయారుచేయవలెను. మతశూన్యమైన యీ శతాబ్దములో, ముఖ్యముగా ధనికులలో తల్లిదండ్రులెవరును తమ విద్యాధర్మముయొక్క పవిత్రతను గాని యావశ్యకతనగాని గుర్తించుటలేదు ! నేడు మనమనుభవించు చున్న నిరంతర పోరాటములు లనేకుల నిర్బంధములు ప్రాణాపాయములు మొదలగు వానికి గారణమేమి? ముప్పదేండ్ల క్రిందట దుర్బలులైన తల్లులును శ్రద్ధ లేని తండ్రులును తమబిడ్డలకు జీవితమొక పవిత్రధర్మమని బోధింపక స్వార్థమునకును, భోగపరాయణత్వమునకును నిదియొక రంగమను యూహాలనే పెంపొందించిరి. తత్ఫలితమునే నేడు మన మనుభవించు చున్నాము. కార్మికులైన మీలో

నింతటి యుపద్రవములు లేవు; మీపుత్రులలో చాలమందికి దారిద్ర్యబాధ క్రొత్తది కాదు. కాని మీ సాంఘిక స్థితిహీనముగా నుండుటచే మీరు నిరంతరము పాటుపడక తప్పదు; కనుక మీబిడ్డలకు తగువిద్య నొసగుట కవకాశములు మీకు లేవు. అయినప్పటికిని మీరుకూడ నీముఖ్యధర్మమును కొంతవరకైనను మీ యుదాహరణములచేతను మీ బోధలచేతను నెరవేర్చవచ్చును.

మీయుదాహరణముచే మీరిట్లు చేయవచ్చును. "మీ బిడ్డలు మీవలెనే యుందురు; మీరు గుణవంతులగుచో వారు గుణవంతులగుదురు. మీరు దోషులగుచో వారును దోషులగుదురు." మీలో న్యాయము సత్యము మీసోదరుల యెడ సానుభూతిలేక యున్నచో మీబిడ్డలలో నిజాయితీ దయారసము మొదలగునవి యెట్లుకలుగును? మీకు మితమను నది లేక పోయినచో వారు తమ యింద్రియ తాపముల నెట్లు చల్లార్చుకొనగలరు? మీరు వారిసమక్షమందే బండబూతులను, కూడని పనులను సిగ్గువిడిచి ప్రదర్శించుచుండ వారెట్లు తమ సహజ నిర్దోషత్వమును నిలుపుకొనగలరు? "వారి సహజకోమల స్వభావములపై మీ సాదృశ్యము లే ముద్రితములగుచుండును. మీ పుత్రులు మనుష్యులగుటగాని పశువులగుటగాని మీపైననే యాధారపడియుండును."

ము భక్తి తత్పరతను బురి గొల్పును. సాంప్రదాయములచే బాధింపబడక ప్రబోధము నొందుచు నిరంకుశత్వమును అరాజకమును గూడ వారు సమానముగా ద్వేషించుచున్నట్లు బోధించును. ఇట్టి మీకృషికి జాతి మీకు తోడ్పడి తీరవలెను. మీరెట్టి సహాయమును మీసంతతివారు దేశమునుండి తీసికొనవలెను. జాతీయవిద్య లేనిదే యుదారమయిన జాతియే యుండనేరదు.

మీతల్లిదండ్రులను ప్రేమించుడు. నీద్వారా యుద్భవించిన కుటుంబము నీవుద్భవించిన కుటుంబమునే విస్మరించునట్లు చేయ నొల్లకుము. [illegible] మిత్రబాంధవ్యములతో పాతబాంధవ్యము సడలునట్లు [illegible] సంబంధముల నెట్లుండరాదు. అవి కుటుంబముల కొరకు త్రివర్గములవారిని, మూడు పురుషాంతరములవారిని, కలుపుచుండవలెను. ముదుసలి తల్లిదండ్రులకు గోమలహృదయముతో, నత్యంతగౌరవప్రేమలతో చివరవరకు సపర్యలు జరుపుచుండుము. మృత్యుముఖమునకు బోవువారి మార్గమును పుష్పచయముతో వెదజల్లుము. నీవు నిష్క్రమించి పోయియున్న వారి యాత్మల కింత విశ్వాసమును, నమృతత్వమును బురి గొల్పును గాక! నీవు నీతల్లిదండ్రులపట్ల చూపిన పవిత్రప్రేమయే నీపుత్రులు నీ యెడల చూపవలసిన దాని కాధారమగు గాక!

తల్లిదండ్రులు, తోబుట్టువులు, సోదరులు, భార్య, బిడ్డలు, అందరును నీకొరకే చెట్టున బుట్టి వివిధ కొమ్మలుగా బోవు

శాఖలవంటివారు. ఒకే ప్రేమతో కుటుంబము నాలింగనము చేయుము. పవిత్రము చేయుము దానిని మీరందరును గలసి దేశము నారాధించు దేవతాయతనముగ నొనర్పుడు! దీని వలన మీరు సౌఖ్యపడుదురో లేదో నాకు తెలియదు; కాని మీరిట్లు చేసినచో నెట్టి విపత్పరంపరలందైనను సరే మీకు లోక శాంతి, మనశ్శాంతి, ఆత్మశాంతి చేకూరునని నేనెరుగుదును.



# మీకును మీరొనర్చుకొన వలసిన ధర్మములు



## ఏడవ ప్రకరణము.



మీకొక జీవితమున్నదనియు, కనుక మీకొక ధర్మముకూడ నున్నదనియు మీధర్మము ననుసరించియే మీరు జీవించుట, యాచరించుట, యాత్మాభివృద్ధి నొందుట మీముఖ్యధర్మమనియు చెప్పియుంటిని. మీ ధర్మమును బోధించుటకు భగవంతుడు మీకు సాధనములను గల్పించియున్నాడనికూడ నుడివితిని; నీయంతఃకరణము, మానవాంతఃకరణము లేక నీతోడిమానవుల సామాన్యవిశ్వాసము — ఈ రెండును నీకు సాధనములు. నీ యంతఃకరణమును నీవు ప్రశ్నించుకొనుము ! చరిత్రద్వారా నీకు తెలిసిన మానవజాతి యైక్యకంఠముతో పోషించు దానితో నీ యంతఃకరణము సామరస్యము నొందినచో సత్యము నీకు కరతలామలమైనదని గ్రహించుమని చెప్పియుంటిని.

కాని మానవలోకము చరిత్రద్వారా చాటుసత్యవాణిని కనుగొనుటకు మీ కిపుడంతగా నవకాశము లేకున్నది.

మీకిపుడు నిజమైనమంచిపుస్తకములా లేవు ! తగినంత సావకాశమా లేదు ! కాని తమ శక్తిసామర్థ్యముల చేతను. బుద్ధివైశద్యము చేతను చారిత్రిక జ్ఞానమును, మానవశాస్త్రమును బాగుగా గ్రహించిన కొందరు గతయర్ధ శతాబ్దమునందీవాఁనుండి కొన్ని ధర్మచిహ్నములను సూచించి యుండిరి; మానవపరిణతి ప్రధానముగా సాంఘికమనియు, విద్యచే సంస్కరింప నర్హమైనదనియు వారుకనుగొనిరి. భగవంతుఁడొక్కడే! కనుక వ్యక్తికిని మానవలోకముకు గూడ నొక్కటే ధర్మము కలదు. అభివృద్ధియే యీధర్మముయొక్క ప్రధానలక్షణము; సార్వత్రికలక్షణము. ఈసత్యము నుండియే మీపట్ల మీరు నెరవేర్చవలసిన ధర్మములును, మీహక్కులును నుద్భవించుచున్నవి. మీధర్మ నిర్వహణములందు మీకప్రతిహతమైన పరిపూర్ణాధికము కలదు; తన్నిర్వహణమందు కొంతవరకు సహాయమును పొందుటకు గూడ మీకు హక్కుగలదు.

మీరు స్వతంత్రులు; మీస్వతంత్రులని మీరు భావించుచునే యున్నారు. వెర్రివేదాంతము తలకెక్కిన వారు మానవాంతఃకరణమును పోద్రోలి, విధిబలవత్తరమైన దనియు దానిని దాటు టెవనికిని శక్యము కాదనియు నెంతచెప్పినను దయారసము, దేశభక్తుల రుధిరస్రావము మొదలగు వాని నెవ్వరును తిరస్కరింపజాలక పోయిరి.

సోక్రిటీసు మొదలు జీససువరకును; జీససుమొదలు నేటివరకును తమ దేశముకొరకు ప్రిత్యహము చనిపోవుచున్న దేశ భక్తులందరు, తమ విశ్వాసకులల కొరకు చనిపోయిన వారందరును యీ నీచబానిస సిద్ధాంతమును గర్హించుచు ముక్త కంఠముతో నిట్లు ఘోషించుచునే యుండిరి. "మాకు గూడ ప్రాణములందు తీపి కలదు. జీవితము మాకు ప్రాణ తుల్యముగాచేసి మహిమ్మధర్మయుద్ధమును మానుకొనవలె నని ప్రార్థించిన వారిని మేమును ప్రేమించుచున్నాము. మా హృదయములలోని ప్రేమరసము మమ్ము 'జీవించుడు! జీవించుడు!' అనియే ప్రేరేపించుచుండెను. కాని మాభావి సంతతి వారి మోక్షము కొరకే మేము చనిపోవ నిశ్చయించు కొంటిమి." ద్రోహియైన కెయినను అను వాని దగ్గరనుండి యీనాటి నీచజీవియైన గూఢచారివరకు, తమ సోదరులను వంచించిన వారందరును, దుర్మార్గజీవితమున కొడిగట్టిన వారందరును, తమ హృదంత రాళములందెట్టి గొడ్డలిపోటులను, నెట్టివిచారమును నంతమనస్తాపమును నిశాంతిని పొందుదురో వారికే యెరుక! "కళ్యాణ ప్రదములైన మార్గములను, తారకమార్గములను, మీరేల విడిచివేతురు?" అనునొక వాణి సింహస్వప్నమువలె వారిని సదా దద్దరిల జేయుచుండును.

మీకు స్వతంత్రులు; కనుకనే మీకు బాధ్యతలు కూడకలవు. ఈనైతిక స్వాతంత్ర్యము వలననే మీకు రాజకీయ

స్వాతంత్ర్యము కధికారము కలిగినది; దీనిని మీయంతట మీరే సాధించి రక్షించుకొను ధర్మమును, యితరులు దీని నాటంక పరుపరాదను ధర్మమునుగూడ నిదియే శాసించుచున్నది. మీ కందరకును విద్యార్హత కలదు. మీయందరిలోను కొన్నిశక్తు లు, కొంతబుద్ధి విశేషము, కొంత నైతిక సంపత్తు కలదు; ఈయన్నింటికి విద్యయే వన్నెదెచ్చును; విద్యయే ప్రాణము నొసగును; విద్యలేనిచో నివి గొడ్డువోవును; జడప్రాయము లగును లేదా క్రమాభివృద్ధి యనునది లేక మెరపుతీగవలె నప్పుడపుడు మాత్రమే గాన్పించు చుండును

విద్యయే యాత్మకాహారము. శరీరాదులు తగుపోష ణలేనిదే యెట్లు పెరుగవో యెట్లు వికాసము నొందజాలవో యట్లే నైతిక ఆధ్యాత్మిక జీవితములుగూడ సంపూర్ణవికాస మును నభివృద్ధిని చెందవలెనన్న బాహ్యసహాయ మత్యవస రము మనము కొంతవరకైన నితరుల భావములను ఆశయ ములను ననురాగములను చూరగొనవలెను; జీర్ణముచేసి కొనవలెను; మనజీవిత మొక మొలకవంటిది. ఒక్కొక రకము మొలక కొక నిజస్థితి ప్రత్యేక లక్షణములు యుండి యొకే క్షేత్రమున బెరుగుచు నన్నిటికిని సమానమగు నాహార పానీ యముల మీదనే వృద్ధిబొందుచుండును. వ్యక్తి మానవలోక వృక్షము కొక వేరువంటివాడు. అతడు మానవలోకమును పోషణనిచ్చి మానవలోకము ద్వారా తనుపోషణము నొందును.

ఇట్లు పోషించుట పోషింపబడుట విద్యవలననే జరుగును. విద్య ప్రత్యక్షముగనో యప్రత్యక్షముగనో మానవజాతి యభివృద్ధినంతను వ్యక్తికి సంక్రమింప జేయుచున్నది. కనుక మీరు విద్య నభ్యసించుటొక్క మీ జీవితము కొరకవసరము లేదు ! అది మీతోడి సోదరులతోను వారికార్యకలాపము తోను నొకవిధమగు పవిత్రసంబంధము నేర్పరచుకొనుటయే యని గ్రహించవలెను. భగవంతుడు మీలో కొన్నిశక్తులను నాటి వానిఫలము ననుభవింపుడని మిమ్ము నాశీర్వదించెను. అట్టిశక్తులను జేపట్టి యాలింగనమొనర్చిన నీజీవితముకును మానవ లోక జీవితముకును సంబంధమును గూర్చు నైతిక, ఆధ్యాత్మిక విద్యయే మనకుగావలెను. ఇట్టివిద్యావిధానమును త్వరితము గాసాధించుటకందరి జీవితముల తోను మీజీవితముకెక్కువ సన్నిహిత సంబంధమేర్పరచుటకు భగవంతుడు మిమ్ము ముఖ్యముగా సాంఘికజీవులనుగా సృష్టించినాడు. ఇతరజంతువులన్నియు సంఘమక్కర లేకుండ ప్రకృతితో జీవించగలవు; మీర ట్లు చేయజాలరు. అడుగడుగుకు మీకు మీ సోదరుల సహాయముండవలెను. వారికృషి మీకు తోడ్పడనిచో మీ జీవితముకు గావలసిన బహు స్వల్పకార్యమును గూడ మీరు నెరవేర్చుకొనజాలరు. మీతోడివారితో గలసి యున్నప్పుడు మీరితరజంతువు లన్నిటికంటెను బలవంతులు; కాని మీరేకాంత శాసనము చేయువారో ననేక జంతువులకన్న మిక్కిలి బలహీనులు; దుర్బ

లులేకాక నభివృద్ధికిని, పూర్ణజీవితముకును ననర్హులు, దేశ భక్తి మొదలగు నుదారాశయములును, కీర్తినికోరుట యితరులను కీర్తించుట మొదలగు నంతకంటె నల్పాశయములును, మీ పరిసరములనున్న కోటానకోట్ల ప్రజాజీవితముతో మీ జీవితమును మేళవింపజేసుకొనవలెననెడు సహజవాంఛ నేకదా తెలుపుచున్నవి. ! మీరు సాంఘికజీవితములు కొరకే సృష్టింపబడినారు; అది మీ బలము ననేకరెట్లు పెంచుచున్నది; అది యితరుల భావములను మీభావములను, నితరులయభివృద్ధిని మీ యభివృద్ధినిగాను చేయుచున్నది; మానవ కుటుంబమంతయు నొక్కటే యనుభావమును పెంపొందించి మీస్వభావమున కౌన్నత్యమును, అభివృద్ధిని, పవిత్రతను, ప్రసాదించుచున్నది. నీసోదరులతో నీకెంత సన్నిహితమైన, విశాలమైన, గంభీరమైన సౌభ్రాతృత్వమున్న నీవంత యభివృద్ధిచెందుదువు. అందరి కృషివలననే గాని జీవితధర్మము పూర్తిగానిర్వహింప బడనేరదు. గొప్పయభివృద్ధి జరిగినపుడెల్ల; పైధర్మములో నొక యావంతయైనను కనుగొనబడినపుడెల్ల, మానవసంఘము విశాలమగుచుండినట్లును ప్రజలకును ప్రజలకును మధ్యసంబంధము వృద్ధియగుచుండినట్లును చరిత్ర చాటుచున్నది.

మీ రభివృద్ధినొందు జీవులు ప్రాచీను లెరుగని యీ యభివృద్ధి యనుపదమికమీాద మానవలోకము కతిపవిత్రమై

న పదముకాగలదు. ఇది సాంఘిక రాజకీయ ఆధ్యాత్మిక పరి వర్తనమును సూచించుపదము మానవచక్రము నంతను తన యిచ్చవచ్చినట్లు త్రిప్పునట్టి యొక యద్భుతశక్తి యమానుష శక్తి కలదు; అది మానవుల ప్రమేయము లేకుండగనే వారి కర్ధము కాకుండగనే దాని చేష్టలతో వా రెట్టి సహకార మును చూపకుండగనే తనంతతానే సృష్టి స్థితిలయములను జేయుచుండువిధి; బ్రహ్మ వ్రాతయని వారు నమ్ముచుండెడి వారు. మానవుడు చిరకాలము ండు దానిని శాశ్వతముగా నుం డు దానిని దేనిని కనుగొన శక్తిలేనివాడని వారు నమ్మిరి. ఇక్కడ కొందరు వ్యక్తులు గీసిన గీటులోనే ప్రజలు పడియుం డ వలెనని పుట్టుట కొంత యధికారము ననుభవించుట వృ ద్ధాప్యము నొందుట మరల తల యెత్తకుండ నశించుట తమకు విధి వ్రాతయనియు వారు విశ్వశించిరి. వారుతమ దేశము లేక నగరము తప్ప మరే చారిత్రిక జ్ఞానముగాని లేని కూపస్థ మండూకమువలె తమరున్న తమకు గల్పించు కొద్దిభావములు సత్యములు సత్యమనుకొని మానవ జాతియంతయు నొకప్రాణ ము న్యాయములేని గుట్టు యనుకొనిరి; కట్టెల మోపువంటి దనుకొనిరి. వ్యక్తి జీవితమునుబట్టియే వారు మానవజాతి నూ హించుకొనిరి. ఇట్టి సిద్ధాంతముల వలనను దాసీనత యెట్టిచెడు గునైనను మార్చవలె ననెడు యాశయములే లేక పోవుట జడత్వము అశక్తత మొదలగునవి సంభవించెను. పరిస్థితుల

వలన ప్రభుత్వమేర్పడిన చోట్ల రిపబ్లికుగ ప్రభుత్వమేయుండి పోయెను; నిరంకుశత్వమున్నచోట్ల ప్రజలు బానిసలై యభివృద్ధిపట్లను దాసీనులైరి. ప్రతిచోటను రిపబ్లికు ప్రభుత్వమైనను మానవకుటుంబము కులములక్రింద ప్రాచ్యదేశములలో నాలుగు—గ్రీసు మొదలగు దేశములలో యజమాని బానిసయని రెండు తెగలు) విభజింపబడి యుండుటను చూచి వారును యిట్టి కులతత్త్వము నంగీకరించిరి, ద్వివిధములగు మానవు లున్నారని వారు భావించిరి. ప్లాటో అరిస్టాటిలు మొదలగు గ్రీసు దేశపు ధీమంతులు గూడ దీనినంగీకరించిరి. ఇటువంటి ప్రజలలో మీ తరగతికి మోక్ష మసంభవ మయ్యెడిది.

జీసను బోధలను పురస్కరించుకొని మతమును స్థాపించినవారు అభివృద్ధి యను సూత్రమును కొద్దిగా గ్రహించిరి; కాని వారీమాటలోనున్న పవిత్రభావమును పూర్తిగా గ్రహింపజాలకపోయిరి. మానవజాతి యొక్కటే! న్యాయమొకటే! మానవుడు పూర్ణుడు అనునని వారు గ్రహించిరి. కాని భగవంతుడు వీనిని సాధించుటకు మానవునకు బ్రసాదించిన శక్తిని, వీనిని సాధించు మార్గమును వారు గ్రహింపజాలక పోయిరి. వ్యక్తి జీవితమును బట్టియే వీరును జీవితముయొక్క ధర్మమును గ్రహింపగలిగిరి. మానవలోకమును సాము దాయక వ్యక్తి వీనికిద్యోతకము కాలేదు. ప్రాచీను లూహించినమూఢ, గుడ్డివిధికి బదులొక దైవము, భగవంతుడున్నాడని వారు

గ్రహింపగలిగిరి. కాని యీదైవము మానవలోకము నంతను పాలించు న్యాయమని గాక వ్యక్తిని రక్షించు దేవుడు మాత్రమే యని వీరనుకొనిరి: వ్యక్తి దుర్బలుడు; జీవితము కడు స్వల్పము; పూర్ణుడగుట బహుదుర్ఘటము; అసాధ్యము, కనుక భగవంతునికిని మానవునకును మధ్యనొక శక్తి యుండవలెను అని వారూహించి భగవంతుని యవతారమును తెచ్చి పెట్టిరి. సాముదాయిక మానవలోక వ్యక్తి యున్నదని వారు గ్రహించలేరు. ఈ యవతారమును విశ్వసించినవారికే శక్తి, భగవత్ప్రసాదము, మోక్షము సిద్ధించునని వీరు చాటిరి.

భగవంతుడు మానవలోకము ద్వారా నిరంతరము నవతరించుచునే యున్నాడను సంగతి వారు గ్రహించక నొకని యమితకాలములో నొకసారి భగవంతుడే యతని ప్రత్యేక ప్రసాదమువలన యవతారము నొందునని విశ్వసించిరి. వారు మనుష్యులను భగవంతునికి జేర్చు సంబధమును చూపిరి, కాని యిక్కడ మానవలోకములో వారినందరను కలుపునట్టి సంబంధమును గుర్తించలేకపోయిరి. ఒక పురుషాంతరముపయి వెనుకటి పురుషాంతర మెట్లు పని చేయునో గ్రహించలేని వారికి పురుషపరంపర నిష్ప్రయోజనముగా గాన్పించును. కనుక వారు గతపురుషాంతరములను తిరస్కరించి మానవుని ప్రపంచమునుండి దూరముచేసి మానవలోక విషయములనే మొత్తముగా త్రోసివేసిరి; ప్రపంచము నప్పటి యధికారులకే

విడిచివేసిరి; అది పాపభూయిష్టమనియు, స్వర్గమునకు విరుద్ధమయినదనియు నడిపిరి. భగవత్ప్రసాదము, విశ్వాసము గలవారు స్వర్గమును పోదురు, లేనివారికది యెప్పుడును ప్రాప్తించదు. ఒకయుగములో నొక్కసారి భగవంతు డవతరించును. అట్టి యవతారము పరిపూర్ణజ్ఞానమును కలిగియుండును; దానికి నూతనముగా జేర్చవలసిన దేదియు నుండజాలదు అని వారను కొనిరి. "నేను మీకు బోధింపవలసిన విషయము లనేకములు గలవు; వాని నన్నిటిని మీరిపుడు వినజాలరు. కాని సత్య దేవత యవతరించి నపు డతడే మీకు సత్యమ నంతను విశదము చేయును. అతడు తనంత తానుగా నేమియు పలుకడు; ఆతని కేదశ్రుతమగునో యదియే చెప్పును." అని జీసను యొకసారి చెప్పెను. ఈ వాక్యములలో నభివృద్ధి సూచింపబడెను; మానవలోకముద్వారా నిరంతరము సత్యము ద్యోతకమగు చుండుననను సూచన కూడ కలదు. పునరభ్యుదయమును గాంచి రోము యిటలీకి బ్రసాదింప నున్న "భగవంతుడు—ప్రజలు" అను సూత్రము గూడ నిందులో ధ్వనించుచున్నది. మధ్యయుగము వారి విశ్వాసములనే నమ్మినవారు దీని నర్థము చేసికొనలేదు; కాలమూ పరిపక్వము కాలేదు.

జీసను తరవాత పదమూడువందల సంవత్సరములకు యిటలీ యంతలోను మహామేధావియైన కవీశ్వరు డీక్రింది సత్యములను వెల్లడిచేసెను "భగవంతు డొక్కడే కలడు;

ఈవిశ్వమునేని సంకల్పము; కనుక నీవిశ్వముకూడ నొక్కటే! భగవంతుని నుండియే సమస్తమును వచ్చుచున్నది; కనుక నన్నియు దివ్యస్వభావమునే (అవినిర్మింవబడిన కృషికితగినట్లు) కలిగియున్నవి. సృష్టి జాలమంతటిలోను మానవుడే సర్వోత్తముడు. భగవంతుడు తన నిజస్వభావము నితరులలో కన్న మానవునిలో నెక్కువగా బ్రతిష్ఠించినాడు. భగవంతునినుండి వచ్చిన ప్రతివస్తువు పరిపూర్ణత (దాని యధికారమున కర్హమైన) కొరకే పాకులాడుచుండును. ఇట్టి పరిపూర్ణతకు మానవునకున్న శక్తి యపారమైనది. మానవలోకమంతయు నొక్కటే! భగవంతుడు దేనిని నిరుపయోగముగా సృష్టించలేదు; మానవలోక మొక్కటే కనుక మానవుల కందరకు నొక్కటే లక్ష్యముండవలెను; అది యీయందరి పరిశ్రమవలననే సాధింపబడగలదు. కనుక మానవజాతి యంతయు నైక్యకంఠముతో పనిచేయవలెను. అప్పుడే యనేక చోట్ల చెదిరి యున్న ధీశక్తులన్నియు కలసి తత్త్వవిచారమందును కర్మ కలాపమునందును సర్వోత్కృష్టమైన యభివృద్ధిని పొందగలవు. కనుక మానవజాతి కంతకు నొకే పశ్చాత్మకమైన మతము కలదు."

జోంటీ మహాకవి యీవాక్యముల నుడివెను. ఈభావములలో భావిమత బీజములు కలవు; కనుక నిటలీ స్వాతంత్ర్యమును బడసి యైక్యత నొందిన తరువాత ప్రతిపట్టణములోను నితని పేర శిలావిగ్రహములు నిర్మింపబడవలెను. ఈభావము

లు ల్యాటిను భాషలో వ్రాయబడెను; నేడు పండితులమని యనుకొనువారుకూడ. వీనిని నిర్లక్ష్యము చేసిరి. కాని యొక సారి బుద్ధి యను క్షేత్రమున నాటుకొనిన భావము లెన్న డును నశింపజాలవు. జన్మస్థానము మరచినను వీని నితరు లను భవింతురు. మానవులొకసవీధిని సంచారము చేయు శాఖోప శాఖలుగల మహీరుహమును మెచ్చుకొనుచుందురు. కాని దానికి మూలమైన బీజము నెవరును గుర్తింపరు!

డేంటీకవినాటిన విత్తనము ఫలప్రదమయినది. అది యనేక బుద్ధిమంతులచే నప్పటప్పట దోహదము గావింపబడి పదునెనిమిదవ శతాబ్దాంతముతో వృద్ధి గాంచెను. అభివృద్ధియే జీవితముయొక్క శాసనము. అనునది గుర్తింపబడి పెంపొంది శాస్త్రముచేతను, చరిత్రచేతను ధృవపరుపబడెను, ఇప్పుడు ప్రతివాడు నీశంఖారావమునే పూరించుచున్నాడు.

అభివృద్ధియే జీవితముయొక్క శాసనమని నేడు మన ముగ్రహించితిమి. వ్యక్తి యభివృద్ధిచెందవలెను; మానవలోక మభివృద్ధిగాంచవలెను. ఈన్యాయము నీప్రపంచమున మానవ లోకము నెరవేర్చును; వ్యక్తియిచ్చటను మరొకచోటను దీనిని నెరవేర్చును. ఒకదేవుడు; ఒకన్యాయము, సృష్టింపబడిన క్షణ ముమొదలు మానవలోకము క్రమముగా, నిశ్చయముగా నీ న్యాయమును సాధించుచున్నది. సత్యమెప్పుడును పూర్తిగా గాని యొక్కసారిగాని ద్యోతకము కాలేదు, యుగయుగము

కొంత కొంత సత్యము తెల్లమగుచుండును: ఇవన్నియు పరిపూర్ణత నొంద యత్నించుచున్న మానవజీవితమును సంపూర్ణముగా మార్చివేయుచు నొక విశ్వాసము నొకమతము కాగలదు. కనుక మతమును గురించిన భావము లెప్పుడు ననంతముగా వృద్ధియగుచునే యుండును. ఒక విశ్వాసము తరువాత వచ్చు మరియొక విశ్వాస మీభావమును వికసింపజేయుచు పవిత్ర మొనర్చుచు చివరకు దేవాలయ శిఖరమువలె నొక గొప్ప ప్రపంచ మతమును నిర్మించును. బుద్ధిమంతులును నసాధారణమైన గుణసంపత్తి కలవారును దీనికి ఋత్విజులు కాగలరు. ప్రజలీ సత్యమును మథనముచేసి స్వీకరించి, యాచరణకు దెచ్చుచు భావి పురుషాంతరములవారి కందిచ్చుచు మానవజీవితము యొక్క సమస్తశాఖలందును దీనిని చూరగొందురు.

మానవ లోక మనంతకాలము జీవించుచు సంతతము విద్యావినయములను, శిక్షను బొందుచుండు నొక వ్యక్తి వంటిది. కనుక మనుష్యులలోగాని, యధికారులలోగాని ప్రమాదములుండకుండ నుండజాలవు. ధర్మమును తలుపగల ప్రత్యేక జాతి లేక కులములేదు; ఉండజాలదు. భగవంతునకు మానవునికి మధ్య మానవలోకము దప్ప వేరొక మధ్యవర్తి యుండుట కవసరము కలుగలేదు; కలుగదు. భగవంతుడు మానవలోకము కొక దివ్య విద్యావిధానమును కల్పించి ప్రతి వాని

హృదయమందు 'నభివృద్ధి యభివృద్ధి' యనెడు బీజమును నాటి మానవప్రకృతిలో తత్సిద్ధికై బలము సమస్త శక్తులను గూడ సమర్చియున్నాడు. వ్యక్తి స్వతంత్రుడు; బాధ్యుడు; ఇట్టివాడు ధర్మమార్గము నవలంబించి యీశక్తులను వినియోగించుకొన వచ్చును; లేదా స్వార్థపరుడై వీనిని దుర్వినియోగముచేయ వచ్చును; తన యభివృద్ధి నతడు త్వరిత ము చేసికొనవచ్చును; లేదా యాలస్యముచేసి కొనవచ్చును. కాని భగవద్విధాన మును మాత్రమే మానవమాత్రుడును నాశము చేయజాలడు మానవలోకముయొక్క విద్యలేక సంస్కారము పూర్తి కాక తప్పదు. మోటుజాతివారి దండయాత్రల వలన నాగరిక జీవిత మంతయు నంతరించునను కొంటిమి; ఫలితమేమయ్యెను! వెను కటి దాని కన్న నుత్కృష్టమైన యొక నూతన విజ్ఞాన ముద యించి ముందటికంటె నెక్కువగా ప్రపంచమందు విస్తరించెను. కొద్దిమంది వ్యక్తులు చూపు నిరంకుశత్వము పోయి స్వాతంత్ర్య ము త్వరితగతి నభివృద్ధి చెందెను.

కనుక నీయభివృద్ధి మరియొకచోటవలెనే యీప్రపంచ మందును సిద్ధించవలెను. ప్రపంచమునకును, స్వర్గమునకును వైరు ధ్యమేమియులేదు. మనము భగవన్నిర్మాణమును, నతడు మన కు ప్రసాదించిన గృహమును నధికారులకును, (వారితత్వమెట్టి దైనను సరే) దురహంకార, దౌష్ట్య, నిరంకుశ శక్తుల దాడికి ని విడిచి యతనిని ధిక్కరించుచు పాపులము కాదనుకొనుట

దైవ ద్రోహము ప్రపంచము పాపపంకిలముకాదు; అది మన యాత్మలలో నాటుకొనియున్న సత్య న్యాయ ధర్మములను సాధించుకొను రంగస్థలము అది మనలను మన పరిపూర్ణతకు గొంపోవు సోపానమువంటిది. మన కర్మల చేత మానవ రూపములో నున్న భగవంతుని కీర్తించుటచేతనే యది లభ్యమగును; భగవ ద్విధానమును శక్తికొలది నాచరించుటకు మన శరీరము నర్పించినపుడే యదిలభ్యమగును, మనము ముందుకు పోవుటయు లేక నధఃపతితుల మగుటయు మనము మనసోదరులకు చేయు మంచిమీదను వారియభివృద్ధిని సాధించుకొనుటలో వారికి తోడ్పడిన తోడ్పాటుమీదను నాధారపడి యుండును. మనతోడి వారితో నంతకంత కెక్కుడు సంబంధమును కలిగి యుండుటచేతనే మనశక్తి యభివృద్ధి యగును. మనధర్మము లాపథముననే విస్తరింపవలెను. అభివృద్ధిని కార్యరూపమునకు దెచ్చుట కిదియే మార్గము. మానవలోకము నంతను నొక్క కుటుంబము క్రిందకు దెచ్చుటే మన లక్ష్యము; ప్రతివ్యక్తియు నితరుల శ్రేయస్సుకొరకొక ప్రతినిధివంటివాడు. యుగయుగము పురుషాంతరమునుండి పురుషాంతరము మానవలోకము పరిపూర్ణత నొందునట్లే వ్యక్తికూడ జన్మజన్మకు నిజప్రయత్నముల ననుసరించి పరిపూర్ణత నొందుచుండును. అభివృద్ధి యను పదములో నిమిడియున్న కొన్ని సత్యముల నిచ్చట చెప్పియున్నాను; భావిమతము కివియే యాధారములు కాగలవు ఈపదములోనే మీమోక్షమున్నది.

# స్వాతంత్ర్యము

## ఎనిమిదవ ప్రకరణము.

మీరు జీవించుచున్నారు; మీలో నున్న ప్రాణము కారణజనితము కాదు; అదృష్టముకాదు, అదృష్టమను పదము కర్థము లేదు. కొన్ని విషయములను తెలిసికొనలేక మానవులీ పదమును కల్పించినారు. మీలో నున్న జీవితము భగవంతునుండి వచ్చుచున్నది. దానిక్రమాభివృద్ధిలో నొక సూక్ష్మవిధానము కాన్పించుచున్నది. మీ జీవితము కొక లక్ష్యము, యొక ప్రయోజనము కలదు.

మన పరమ లక్ష్యమెద్దియో మనకిపుడు గోచరమగుట లేదు; అది యట్లే యుండును. కాని యీకారణముచే మనము దీనిని లేదనజాలము కుటుంబము, దేశము, మానవలోకము మొదలగు వానిద్వారా చేరవలసిన ప్రయోజనము శిశువుకేమి తెలియును? తెలియుటలేదు కాని శిశువుకొక ప్రయోజనముకలదు. మానవలోకము భగవంతునిబిడ్డ? అది చేరవలసిన లక్ష్యము నతడెరుగును. అభివృద్ధియేతనధర్మమని మానవలోకమిప్పుడిపుడే గ్రహించుచున్నది; అదితన చుట్టు నున్నవిశ్వమును గురించి కూడ నిప్పుడే కొద్ది కొద్దిగా తెలిసికొనుచున్నది; ఈ మానవజాతిలో నున్న వారిలో నెక్కువ

మందిసంస్కారహీనులగుటచేతను, బాల్యవివాహముల కారణముచేతను, బాలికలగుటచేతను, బ్రాహ్మణేతరులుగా విద్యలేనివారగుటచేతను, యీ ధర్మమును, విశ్వధర్మమును, గ్రహించుటకింకను అనర్హులయి యున్నారు; మనలను మనము తెలిసికొనుటకు పూర్వమిది గ్రాహ్యము కావలెను. ఈచిన్న యూరపునందున్న ప్రజలలోనే కొద్దిమంది యోజ్ఞాపసము పార్జనకు గావలసిన ధీశక్తిని కలిగియున్నారు. మీలో చాల మంది విద్య లేనివారగుటచేతను, వేఱు మార్గము లేక నుప ద్రవకరమయిన కాయకష్టమునకు దాసులగుటచేతను మీశ క్తులు నిద్రాణ మొందుచున్నవి; జ్ఞానశిఖరమున కివి యెంత మాత్రమును తోడ్పడజాలకున్నవి. అందరి సాముదాయిక కృషియు యున్నగాని తెలియనిదానిని మన మిప్పుడెట్లు తెలిసి కొనగలము? మనమింకను యీ పవిత్ర శబ్దము నుచ్ఛరించుట కైనను ప్రారంభింపలేదు. అట్టితరి ప్రపంచాభివృద్ధికి చివర స్థానము నింకను చేరలేదను కించగాని తిరుగుబాటుగాని మన కేల యుండవలెను? కనుక మనకింకను చాలకాలమువరకసా ధ్యములగు విషయములను గాక ప్రస్తుతము సాధ్యములగు వానినేల విడువవలెను? సత్యమును కనుగొనుటకు వినయము, ఆత్మనిగ్రహము. స్థిరత్వము మొదలగునవి కావలెను. క్రొత్త ముకన్న తొట్రుపాటు, మానవాహంకారము యీ రెండు నెక్కువమందిని నాశము చేసెను. ధర్మమార్గమునుండి తొలగించెను. భూమ్యాకాశములను జయించవలెనని విర్రవీగిన

నిరంకుశులును ప్రపంచమును చాప చుట్టగా జుటఁప నుత్స హించిన ప్రతాపయుతులను చివరకు బూడిద పాలగుటను సత్యము దీనినే రుజువు చేయుచున్నది.

మానవపరమావధి యెద్దియైనను మనము దానిని క్రమాభి వృద్ధిచేతను మాత్రమే సంపాదింపగలము. భగవంతుడు మనకు పరిశ్రమ సాధనములుగా మన శక్తులను ప్రసాదించియున్నా డు. కనుక నీ ధర్మసాధకముగా వాని నభివృద్ధి నొందింపవలెను. వాని నుపయోగించుటలో నట్టి యాటంకములను కలుగకుండ సంరక్షింపబడవలెను. స్వాతంత్ర్యము లేనిదే నీవు నీధర్మ మును నెరవేర్చజాలవు. కనుక నీకు స్వాతంత్ర్యము నకు హక్కు కలదు; దానిని నిరోధించు నేయధికారమునైనను ధిక్కరించి యెట్టి సాధనములతోనైనను మీ స్వాతంత్ర్యమును మీరు లాగికొనుట మీ ధర్మమై యున్నది.

స్వాతంత్ర్యము లేనిదే నీతియుండజాలదు. మంచి చెడు గులనుగాని స్వార్థపరార్థములనుగాని యథేచ్ఛగా స్వీకరిం చుటకు స్వేచ్ఛలేనపుడు బాధ్యతయు నుండజాలదు. స్వాతం త్ర్యములేనిదే యదార్థమైన సంఘముండజాలదు; ఏలనన స్వ తంత్రులకును బానిసలకును మధ్య సౌభ్రాతృత్వముండ జాలదు. కొద్దిమంది చాలమందిపై రాజ్యాధికారము చెలాయిం చుచుందురు. వ్యక్తిపవిత్రమైనట్లె స్వాతంత్ర్యముకూడ పవి త్రమైనది. స్వాతంత్ర్యము లేనిచోట జీవితము కేవలము

యెముకల పోగువంటివగును. తనస్వాతంత్ర్యము నిరోధింపబడినపుడు చూచుచు నూరకుండువాడు తన నిజప్రకృతిపట్ల ద్రోహి, భగవచ్ఛాసనమును ధిక్కరించిన విద్రోహియగుచున్నాడు.

ఒక వ్యక్తిగాని, యొక కుటుంబముగాని, యొకతరగతిగాని పుట్టుకచేతనో లేక ధనముచేతనో లేక తమకట్టిదివ్యహక్కుకలదని వంచించియో యితరులపై నధికారముచేయుచుండ దేశములో స్వాతంత్ర్య ముండజాలదు. స్వాతంత్ర్య మందరికిని యుండవలెను. అందరి యందుబాటులోను నుండవలెను. భగవంతుడు రాజ్యాధికారమునే యొకవ్యక్తికో నప్పచెప్పడు. భగవంతుడే ప్రపంచములో నుండతగిన యధికారమును మానవలోకమునకు, జాతులకు,సంఘములకు, బ్రసాదించినాడు. ఈచిన్న సంఘము లీయధికారమును భగవద్విధానమును నెరవేర్చుటకును, మానవకళ్యాణమునకును వినియోగించినచో నిదియు దీనితోపాటు నాసంఘములును రూపుమాయును. కనుక నెవరికి రాజ్యాధిపత్యము హక్కుగా సంక్రమింప జాలదు. మన లక్ష్యమందును దానిని పొందుటకు జేయు కర్మలందును మాత్రమే యాధిపత్య మేర్పడును. మనకార్యములు, మనలక్ష్యములు అందరి యామోదములను పొందవలెను. కనుక శాశ్వతమైన యాధిపత్యముండదు, ఉండజాలదు! ప్రభుత్వము అని మనము పిలుచునట్టి సంస్థమన సృష్టియే ! జాతియొక్కల

క్ష్యము నతిత్వరితముగా నెరవేర్చుటకే కొద్దిమంది కీధర్మమును వప్పగించితిమి; వారీధర్మమునకు ద్రోహులగుచో వారి నంత మొందింప వలెను. ప్రభుత్వమునకువచ్చు ప్రతివాదును, ప్రజల యిచ్ఛను పాలించుటకే యేర్పడినాడు. అతని నెన్నుకొనవలెను. అతడీ యిచ్ఛకపార్థములను తీసినను బుద్ధిపూర్వకముగా వ్యతిరేకియైనను; నతనికి స్వస్తిచెప్పవలెను. స్వాతంత్ర్యము నూడబెరుకనిదే యొకకులముగాని తరగతీగాని యధికార మును తమహక్కులవలె చెలాయింప జాలదు. మీయభిమ తములేకుండ మీపై నధికారమును చెలాయించు మనుజు లుండ మీరు స్వతంత్రులెట్లు కాగలరు? ప్రజాస్వామి యేధ ర్మబద్ధమైన ప్రభుత్వము. ఇహమున ప్రజలును, పరమున భగ వంతునునుదప్ప మీకు లేరు. ప్రభుత్వము లేదు. భగవదభీష్టము మీకు ద్యోతకమైనంతవరకు శిరసావహించుడు. ప్రజలు, మీతోడి సముదాయమంతయు, నొకవిశ్వాసమును కలిగి యున్నపుడు మీరు దానికి తలయొగ్గవలెను; తిరుగుబాటు చేయరాదు.

కాని మీ వ్యక్తికి సంబంధించిన విషయములు కొన్ని గలవు. అవిమానవ జీవితములకు ప్రాణతుల్యమైనవి. వీనిపై ప్రజలకుగూడ నెట్టియధికారమునులేదు. మిమ్ము మానవులుగా జేయు విషయముల నెంతటి సంఖ్యాబలముగాని యెట్టి సా ముదాయక శక్తిగాని మీనుండి తస్కరింపజాలరు. ఎంతటి

సంఖ్యాబలముగాని నిరంకుశత్వమును సాగించి తన స్వాతంత్ర్యమునే పోగొట్టుకొన జాలరు. ఇట్టి యాత్మహత్యను గావించుకొను ప్రజలపై మీరు దౌర్జన్యమును ప్రయోగింప జాలరు కాని మీ పరిస్థితులు కల్పించు యెట్టిసాధనముచేతనైనను మీరు దీనిని గల్పించుట కధికారమును గలిగియున్నారు. మీకు స్వాతంత్ర్యముండి తీరవలయును; జీవితముయొక్క నైతిక, భౌతిక దోహదముకు ప్రాణావసర మైన వన్నియు నుండవలెను.

వ్యక్తి స్వాతంత్ర్య ముండవలెను; తిరుగుటకు, మతవిశ్వాసముకు అన్నివిషయములయందు నభిప్రాయములను ప్రకటించుటకు వానిని గ్రంథముల ద్వారాగాని మరే శాంతిపద్ధతినిగాని తెలియపర్చుటకు నొకరి భావములవలన నొకరు సంస్కారమును పొందుటకు స్వేచ్ఛగాకలసియుండుటకు; మీకృషిచే తయారైన వస్తువులతో వర్తకము చేసుకొనుటకు:-యీయన్నిటికి మీకు స్వేచ్ఛకలదు. వీనినెవరును లాగికొనరాదు. ఇట్లుచేయుట మహాపరాధము, దీనిని గర్హించుట మీవిధి—

కారణము తెలుపకుండ, నిన్నొక న్యాయస్థానముకు తీసికొనిపోకుండ సంఘముపేర నిన్ను చెరసాలలో నుంచుటకు గాని గూఢచారులబారికి గురిచేయుటకుగాని యెవనికిని యధికారములేదు. నీజన్మభూమిలో యిష్టము వచ్చినట్లొక ప్రదేశమునుండి మరియొకప్రదేశముకు పోవుటకు ప్యాసు పోర్టుల

ద్వారాగాని ఆంక్షలద్వారాగాని నీకభ్యంతరము కలిగించుటకు
కెవరికిని యధికారములేదు. నీమతవిశ్వాసముల మూలమున
నిన్ను హింసించుటకును, నీపై శాసనములు గావించుటకును
నవమానమును జూపుటకును నెవనికిని యధికారములేదు. మాన
వలోక గర్భ కుహరములనుండి బయల్వెడలు వాఖ్యానములు
దప్ప భగవంతునికిని నీ యంతఃకరణమునకును మధ్య అడ్డువ
చ్చుట కెవనికి నధికారములేదు. భగవంతుడు నీ కాలోచన
నొసంగినాడు. దానిని నిర్బంధించుట కెవనికి నధికారములేదు.
దానిని ప్రకటించుట కెవడును నిన్నడ్డగింపరాదు. నీయాత్మ
నీసోదరునియాత్మతో భాషించుట కిదియేమార్గము మనయ
భివృద్ధి కిదియొక్కటేమార్గము. ముద్రణాధికార మప్రతిహత
ముగానుండవలెను. జ్ఞానధనముకుగల హక్కులనెవరును నడ్డ
గింపరాదు. దానిపై నాంక్షపత్రములను జారీచేయుట నిరంకు
శత్వము. సంఘమితర దుర్మార్గములను శిక్షించునట్లే బహిరం
గముగా నవినీతిని, నేరములను పురిగొల్పువ్రాతలకు శిక్షింప
వచ్చును. ప్రజాన్యాయస్థానములలో విచారణ జరిగిన తరు
వాత శాశింపబడు శిక్షమన మానవ బాధ్యతలవలననే కలు
గుచున్నది. అంతకుపూర్వమే చేయునిర్బంధము స్వాతంత్ర్య
మును నాశముచేయును. శాంతి యుతముగా ప్రజలు కలిసి
యుండుట పవిత్రకార్యము. మీ యభివృద్ధికి సాధనముగా
భగవంతుడు మీకిట్టి సాంఘికస్వభావమును ప్రసాదించి

నారు. మానవకుటుంబమెప్పుడో యొకప్పుడు పొందనున్న యైక్యతకిదియొక సాక్ష్యము. దీనినరికట్టుటకుగాని త్రుంచుటకు గాని యేప్రభుత్వమునకు నధికారములేదు. భగవంతుడు మీ కిచ్చిన జీవితమును వినియోగించుట; రక్షించుకొనుట; యభి వృద్ధి చేయుట. మీధర్మము కనుక మీరు మీజీవితమునకు ఋణపడియున్నారు. దాని భౌతిక పోషణమునకు సాధనమైన పరిశ్రమలేక, పాటుమూలమున మీరీ ఋణమును తీర్చుకొ నవలెను. పరిశ్రమలేక పాటు పవిత్రమైనది. దానిని నిరోధించు టకుగాని వలదనుటకుగాని నిరంకుశచట్టముల ద్వారా నిర్వీర్య ము చేయుటకుగాని యెవరికి నధికారములేదు. ఈపాటువల నను తృప్తియగు వస్తువులను మీరుస్వేచ్ఛగా విక్రయించు కొనుట కెవరును నడ్డు రాకూడదు. మీజన్మభూమి మీపు ణ్యస్థలము. అచ్చటనన్నిప్రాంతములకును మీకు హక్కుగ లదు. ఇట్టి మీస్వాతంత్ర్యములన్నియు పవిత్రములని యం గీకరింప బడినపుడు ప్రభుత్వము నందరి యెన్నికాధికారము పైనను స్థాపించినపుడు మానవ శక్తుల నభివృద్ధి చేసికొనుట కు గావలసిన మార్గములన్నియు ప్రతివ్యక్తికి గరతలామలకము గావింపబడినపుడుగూడ మీయందరి పైన నొక విధాయిక ధ ర్మము కలదు. మీ కొక యుత్కృష్ట లక్ష్యము కలదు. మీ రును మీతోడివారును నైతిక పరిపూర్ణత నొందవలెను. మా నవకుటుంబములోని సభ్యులందరకు నంతకంత కెక్కుడు విశాల

సంబంధ మేర్పడవలెను. చివరకు భావికాలమున నొక్క ధర్మ మే యేర్పడవలెను.

"విశ్వాత్మకమైన కుటుంబమును, భగవంతుని దివ్యనగరమును, నిర్మించునదే మీధర్మము; మీ నిరంతర పరిశ్రమవలన మానవలోకము కతడు నియమించిన కార్యమును క్రమముగా నాచరణకు దెచ్చునదే మీధర్మము. మీరు పరస్పరము సోదరులవలె ప్రేమించుకొనుచు, నొకరియెడ నొకరిట్టి గౌరవముతో మెలఁగుచు, నందరి కళ్యాణములోనే మీకళ్యాణమును జూచుకొనుచు, నందరిజీవితములతో మీ జీవితము నైక్యము జేయుచు, నందరి ప్రయోజనములలోనె మీప్రయోజనమునే చూచుకొనుచు, మీ కుటుంబములోని సభ్యుల కొరకాత్మార్పణము చేయుటకెప్పుడును సన్నద్ధులగుచు వారును మీకొరకట్లే సర్వమును త్యాగము చేయునున్నపుడు మానవజాతి నిపుడు క్షోభింపజేయుచున్న చెడుగులన్నియు దృటికాలములో భాస్కరోదయము ముందర పలాయనమగు సాంద్రహిమజాలమువలె పటాపంచలగును. ప్రేమ ప్రపంచ మంతటను చెదిరియున్న మానవ సంఘము నంతకంతకు మెల్ల మెల్లగా నేకము చేసి భగవంతు డొక్కడైనట్లే మానవలోకమొక్కటే యని వెల్లడి చేయవలెననియే భగవంతుని యభీష్టము."

సోదరులారా! పరమహంసవలె జీవించి ప్రజలను వారి భవిష్యత్తును దివ్యప్రేమాతిశయములచే గౌరవించి పరమహంసవలెనే కాలధర్మము నొందినవాని యీ వాక్యరత్నములను మరువకుందురుగాక! స్వాతంత్ర్య మొక సాధనము మాత్రమే! అదియే పరమావధి యని మీరనుకొనుచో మీకును మీభవిష్యత్తునకును చేటు రాగలదు. మీవ్యక్తికి హక్కులును, ధర్మములును కలవు. ఎవరికొరకును మీరు వాటిని పోగొట్టుకొనరాదు కాని మీవ్యక్తికి మీరు చూపవలసిన గౌరవము స్వార్థపరత్వముగా పరిణమించుచో మీకును మీభవిష్యత్తునకును చేటు రాగలదు, మీస్వాతంత్ర్యమనగా మీపయినిక నెట్టియధికారమును లేదను దురభిప్రాయము కాదు. స్వాతంత్ర్య మనగా జాతియొక్క సాముదాయక ప్రయోజనమునకు ప్రతిసిధికాని యధికారమును త్రోసివేయుట యని గ్రహించవలెను. మీయిచ్ఛాభిమతముపైనగాక మరే యాధారముమీదగాని స్థాపింపబడిన ప్రభుత్వమును కూలద్రోయుట యని గ్రహింపవలెను. స్వాతంత్ర్యమను పవిత్రపదమునకు కొందరిటీవల నపార్థములను గల్పించి 'మాకాయుష్యం మాకారోగ్యం' మను నికృష్టస్వార్థములోనికి దింపిరి. 'అహమే యుత్కృష్టమైనది; అదియే సర్వస్వము.' మానవకృషి, సాంఘికసంస్థలు మొదలగువాని యాశయమొక్కటే కలదు. ఈ 'యహము' కోర్కెలను చెల్లించుటే దాని యాశయమం

దును మరికొంద రేప్రభుత్వమైనను, నేయధికారమైనను తప్పని సరియగు జేసేయనియు సాధ్యమైనంతవరకు దానిని తగ్గించ వలెననియు చెప్పెదరు, స్వాతంత్ర్యమునకు మితిలేదు; దీని నంతు లేకుండ పెంచు టొక్కటియే ప్రతి సంఘముయొక్క యు ప్రయోజనము; ఇతరులకు చెడుగుగా పరిణమించనంత వరకు మన సాతంత్ర్యమును మనము వినియోగించుటకు గాని దుర్వినియోగించుటకు గాని మనకధికారము కలదు; ఒకవ్యక్తిని మఱియొకవ్యక్తి బాధించకుండునట్లు చూచుటే ప్రభుత్వము నెరవేర్చవలసినధర్మము అని చెప్పెదరు ఇట్టి సిద్ధాంతములను మీాఁరు నిరాకరించవలెను. ఇటలీయొక్క యౌన్నత్యమునకు వీరే యిప్పటికిని యడ్డు తగులుచున్నారు. మొదటివారి వలన పైతరగతులలో స్వార్థము పెరిగెను. రెండవవారి వలన మనసాముదాయిక ప్రయోజనములకును జీవితములకును ప్రాతినిధ్యము వహింపవలసిన చక్కని సంఘమొక భటుడో లేక పోలీసు యుద్యోగియో జేయవలసిన శాంతి రక్షణకొరకే నియమింపబడుచున్నది. రెంటివలనను కూడ స్వాతంత్ర్య మరాజకమునే తెచ్చిపెట్టుచున్నది; సాముదాయిక నైతికాభివృద్ధి యనుభావమ తరించుచున్నది. సంఘము తనంతతాను నెరవేర్చవలసిన సంస్కారము లేక విద్య, యభివృద్ధి యను ధర్మమునకు స్వస్తి చెప్పబడుచున్నది. ఇదియే స్వాతంత్ర్యమని మన మనుకొను నెడల నిది నిలుచుట కర్హతలేదు; నిలువదు. ధర్మము; అంధ

రను పరిపూర్ణత నొందగలరను విశ్వాసము; అను నీరెండిటి యాధిపత్యముక్రిందను వృద్ధియగునంతకాలమే స్వాతంత్ర్యము పవిత్రత నొందును, స్వాతంత్ర్యమనగా మీశక్తులను మీయిష్టము వచ్చినట్లు మీయిష్టము వచ్చినమార్గములకు వినియోగించుట గాని దుర్వినియోగము జేయుట గాని కాదనియు మీ ప్రత్యేక స్వభావముల ననుసరించి కళ్యాణము నొనగూర్చుటకు స్వేచ్ఛగా సాధనముల నారయుటకు గల హక్కనియు మీరు భావించువాడు భగవంతుడు ప్రజలును గూడ మీ యుద్యమాభివృద్ధికి తోడ్పడక తీరదు.



# విద్య



## తొమ్మిదవ ప్రకరణము.



భగవంతుడు మీకు విద్యార్హతను గల్పించినాడు. కనుక మీ చేతనైనంతవరకు మీకు మీరే విద్య నభ్యసించుట మీధర్మము; సంఘము మీవిద్యకెట్టి యాటంకమును గల్పింపకుండుటే గాక మీకుతోడ్పడి మీకు సాధ్యముకాని సాధనములను గల్పించునట్లు చేయుటకు మీకు హక్కుకలదు.

మీస్వాతంత్ర్యము, మీహక్కులు యన్యాయమైన సాంఘిక పరిస్థితులనుండి మీవిమోచనము, యీప్రపంచమందు మీలో ప్రతివాడును నెరవేర్చ వలసిన జీవితార్థము మొదలగు నవన్నియు మీరార్జించు విద్యలేక సంస్కారముమీదనే యాధారపడియుండును. విద్యలేనిదే మీరు సరిగా మంచిచెడుగులను నిర్ణయించుకొనజాలరు; మీహక్కులను గూడ మీరు గుర్తింపజాలరు. మీకు రాజకీయ జీవితములో నుండవలసిన స్థానముండదు. అదిలేనిదే మీవిమోచనము మీకెన్నటికిని గలుగజాలదు. మీయంతట మీరు మీజీవితార్థమును నిర్ణయించుకొనజాలరు. విద్య మీయాత్మ కాహారమువంటిది. దుక్కికాని నీటి సదుపాయములుగాని, జాగరూకుడైన కృషీవలు

ఘనాని లేనపుడు భూమిలో నాటినవిత్తనము యొక్క ప్రాణ శక్తి వృథయగుచున్నది. అట్లే విద్యలేనిదే మీశక్తులు నిర్వీర్యము నిష్ఫలము నగును.

నేడు మీకు విద్యలేదు; ఉన్నవిద్య చెడు విద్య లేదా మీకెంతమాత్రము నను చాలని స్వల్పవిద్య ఈవిద్యయొక సిద్ధాంతముపైనగాక స్వప్రయోజనమునే చూచుకొను నధికారుల వలననే ప్రసాదింపబడుచున్నది. తమరాష్ట్రములో నచ్చటచ్చటేవియో కొన్ని పాఠశాలలను (పిల్లలకు ప్రాథమిక విద్యను కరపునట్టివి) నెలకొల్పుటతో తమ ధర్మము నెరవేరెనని వీరు తలంతురు. ఇందులో వ్రాయుట, చదువుట, లెక్కలు మాత్రమే బోధింపబడును.

ఇట్టి బోధశిక్ష యనబడును. మన జీవితమునకును మన యింద్రియములకును నెంతభేదమున్నదో విద్యకును దీనికిని నంతభేదమున్నది. మన యింద్రియములే జీవితముకాదు. అవి దాని పరికరములు మాత్రమే! అవిజీవితమును వ్యక్తము చేయునట్టి సాధనములు. అవిజీవితమును నడుపునవికావు; శాశించునవికావు. సిద్ధపురుషులును దురాత్ములునుగూడ కర్మలను వీని ద్వారానే చేయవలెను. ఇట్లేవిద్య బోధించుదాని నాచరించు సాధనమును మాత్రమే శిక్ష కల్పింపగలదు; కాని శిక్ష విద్య యెన్నటికిని కాజాలదు. శిక్షవేరు; విద్యవేరు.

విద్య నైతికశక్తులను సంబాధించినది; శిక్ష బుద్ధికి సంబంధించినది. మొదటిదానివలన మానవుని ధర్మజ్ఞానాభివృద్ధియగును, రెండవదానివలన వాటిని నెరవేర్చుశక్తి కలుగుచున్నది. శిక్షలేనివిద్య తాడులేని బొంగరమువలె చాలవరకు నిరుపయోగమగును. విద్యలేని శిక్ష యాధారములేని త్రాసువలె నుండును. మీరు చదువగలిగి యుండవచ్చును; ఏపుస్తకములు మంచివో యేవిచెడ్డవో యెంతసత్యము కలదో యెందసత్యము బోధింపబడుచున్నదో మనము నిర్ణయించుకొన జాలనపు డట్టి చదువువలన లాభమేమి? మీభావములను మీ సోదరులకు మీరు వ్రాతమూలకముగా తెలుపగలిగి యుండవచ్చును. కాని మీభావములు మీస్వార్థమును మాత్రమే వెల్లడించుచో ప్రయోజనమేమి? ధనమువలెనే శిక్షగూడ దాని నుపయోగించు యుద్దేశ్యమును బట్టి మంచికిగాని చెడుగుకుగాని కారణమగుచున్నది; ఇదియందరి యభివృద్ధికినుపయోగపబడువో స్వాతంత్ర్యమునకును, విజ్ఞానమునకును సాధనముకాగలదు; దీనినిస్వప్రయోజనముకే యుపయోగింతుమేని నిరంకుశత్వము యవినీతి సంప్రాప్తించును; యూరపులో నిపుడు నైతికవిద్యలేని శిక్షయే ప్రమాదముగా బరిణమించినది. అదియొకే ప్రజలలో నితరగతుల మధ్యయెక్కువ తక్కువలను బ్రోత్సహించుచున్నది స్వార్థమును మానవమేధములను లెక్కించుటను ప్రోత్సహించుచున్నది; అన్యాయమును నసత్య సిద్ధాంతమును నంగీకరింపజేయుచున్నది.

శిక్షనిచ్చువారికిని విద్యను బోధించువారికిని చాలతారతమ్యము గలదు. స్వాతంత్ర్యము కొరకు నిరంకుశత్వముతో డీకొనువారిలో రెండు పక్షములు గలవు. మొదటివారు వ్యక్తికే సర్వాధికారమున్నదందురు. రెండవవారు సంఘముకే సర్వాధికారమున్నదనియు (మెజారిటీ) యొక్కవజన సంఖ్య యొక్క యిచ్ఛ ననుసరించి యది పరిపాలించు ననియు వాదింతురు. మానవునికి పుట్టుకచేకలుగు చున్నవనివిశ్వసింపబడు హక్కులనుచాటి నంతమాత్రమున తమధర్మము నెరవేరినదనియు, స్వాతంత్ర్యము రక్షింపబడినదనియు మొదటిపక్షమువారు తలచుచున్నారు. రెండవ పక్షమువారు సంఘమే సర్వస్వమనియు ప్రతివ్యక్తి ధర్మములు నాసంఘముయొక్క యనుమతినుండియే కలుగు చున్నవనియు చెప్పుదురు. మొదటివారు శిక్షనరకే పోవుచున్నారు; ఏలనన శిక్ష వ్యక్తియొక్క వివిధశక్తుల నభివృద్ధిచేసుకొనుట కవకాశములను గల్పించును; కాని వారికంతకంటె విశాలమైన సార్వజనికాదేశములేదు. రెండవవారు విద్యాకతను గ్రహించుచు సాంఘికవిధానమును వ్యక్తము చేయుటయే విద్యయని నుడువుచున్నారు. మొదటిది విధాయికముగా నీతి భ్రష్టులను చేయును. రెండవ దాని వలన స్వాతంత్ర్యముగల హక్కులు విస్మరింపబడి యొక్కని రంకుశత్వము ప్రబలును.

ఈ రెండును సంకుచిత లక్ష్యములచే ప్రమాదములకు పాల్ప

డుచున్నవి. కాని యదార్థమే మన "సర్వాధికారము భగవం తునిది; ప్రపంచమునంతను పరిపాలించుచున్న భగవద్విధా నము నీతిది; మహాత్ములబోధలును; యుగయుగము నభివృద్ధి చెందుచుండు మానవ స్వభావములును దీనిని క్రమముగా విశ దము చేయుచుండును. ఈ సర్వాధికారము మనము సాధించ వలసిన పురుషార్థములోను మనము నెరవేర్చవలసిన ధర్మము లోను కలదు, వ్యక్తిలో సర్వాధికారము లేదు; సంఘము లోను సర్వాధికారములేదు. ఈయిరువురును యీభగవద్వి ధానమును, యీన్యాయమును, యీపురుషార్థమును పాలిం చునపుడే సర్వాధికార మేర్పడుచున్నది. పరిపాలన సాగించు నొకవ్యక్తి యీనీతి మేరనే నీతినిబోధించు మహాపవిత్రుడై నను గావలెను. లేదా దానిని దిగమ్రింగిన వాడైన గావలెను. రెండవ వానిని మనమూడ పీకవలెను. భవిష్య దభివృద్ధికిని, యుత్కృష్టనీతికిని భంగకర్మమైనచో కేవల సంఖ్యాబాహుళ్య ముచే జరుగు నెన్నికవలననే సర్వాధిపత్యము లభింపనేరదు. సాంఘికకళ్యాణము, స్వాతంత్ర్యము, యభివృద్ధి- ఈపదత్రియ మును దాటి సర్వాధిపత్య మెచ్చటను యుండనేరదు.

సాంఘిక కళ్యాణమెట్లు, దేనివలన చేకూరునదియు విద్య బోధించగలదు.

శిక్షవలన సాంఘిక కళ్యాణమును గురించిన భావములు నిరంతరాభివృద్ధి నొందుచుండు నట్టిసాధనములను వ్యక్తి స్వే చ్ఛగానలవర్చు కొనవచ్చును.

తమదేశములో, తమకాలములో నీతోడిప్రజల జీవితములనే సిద్ధాంతములు, యేవిశ్వాసములు పాలించుచున్నవో మీ పుత్రులకు బోధించుట త్యవసరము; తమదేశము యొక్క నైతిక, సాంఘిక, రాజకీయ విధానమును వారికి బోధించవలెను. వారికృత్యముల మంచి చెడుగులను విచారించు న్యాయముయొక్క తత్వమెద్దియో, మానవలోకాభివృద్ధి యితదనుక నెంతవరకు జరిగెనో, యిక ముందెంతవరకు నభివృద్ధి గాంచవలెనో మొదలగు విషయములను వారికి బోధించవలెను భగవంతుడు వారి కాబాల్యమునుండియు ప్రసాదించిన కోటానుకోట్ల జనములతో ప్రేమ, సమభావములతో నైక్యతనొంది యొకేలక్ష్యమును సాధించవలెనను భావమును కలిగియుండుటత్యవసరము. మీ బిడ్డలకిట్టి ప్రబోధము నొసంగు విద్య జాతినుండిమాత్రమే రాగలదు.

నేటినీతి బోధయంతయు నరాజకముగాను నల్లకల్లోలముగాను నున్నది దీనిని కేవలము తల్లిదండ్రులకే విడిచివేసినచోటనిది బొత్తిగా శూన్యమగుచున్నది; ఒకవంకదరిద్రముచే బాధపడుచు రాత్రిందినములు పొట్టకూటికొరకే పని చేయువారు తమబిడ్డలకు విద్యగరపుటకవకాశములేదు; ఇతరబోధకులను నియోగించుటకు ద్రవ్యమసలే లేదు; స్వార్థము. అవి నీతిప్రబలిన కుటుంబములలో నిది చెట్టగా పరిణమించినది. ధనముకలచోట తల్లిదండ్రులు తమ యభిమతములనను

సంబంధి యొకమతబోధకునో లేక మతప్రసక్తి యెంతమాత్రము లేనివానినో యీపనికి నియోగించుచున్నారు. దీనివలన యువకులకు మూఢ విశ్వాసమో లేక విషయలోలతయో స్వాతంత్ర్య వాంఛయో లేక పిరికివానివలె నోరు మూసికొని యుండుటో, ధనవంతుల యధికారప్రాబల్యమో లేక వారిపై తిరుగుబాటో యబ్బుచున్నవి. ఇట్టి విద్యనభ్యసించిన యీయువకులొకే లక్ష్యముకొరకు సోదరులవలె నేల్లేకము కాగలరు? దేశముయొక్క యైక్యతను తమజీవితముద్వారా వారెట్లు వెల్లడించగలరు? వారెన్నడును కనివినియెరుగని సార్వజనిక భావమునభివృద్ధి చేయవలెనని సంఘము కోరును; వారెంతమాత్రము నెరుగునట్టియు, వాటితత్త్వముకాని వాటియవకాశములుకాని సంఘమువారికి బోధించనట్టియు చట్టముల నుల్లంఘించినందుకు వారు శిక్షింప బడుచుందురు. వారు నాగరికులగుటకు ముందువారికే బోధకుడు నెన్నడును బోధించియుండనట్టి పరమావధికొరకు సహకారమును, త్యాగమును చేయుమని సంఘమువారిని కోరును. యువకులకును వ్యక్తిపరముగా బోధించుటకును పాలించుటకును హక్కుగలదట కాని సాంఘికముగా, జాతీయపరముగా లేదని యొకపక్షమువారు చెప్పుదురు. వారు బోధనా స్వాతంత్ర్యమనిచెప్పు దానిలో నైతిక శిక్షనిచ్చుటకు దేశమునకు గలహక్కును తీసివేయుచున్నారు. నాణెములు, తూనికలు, కొలతలు మొదలగునవి దేశమంత

టను హెచ్చుతగ్గులు లేకుండ నొకేమాదిరిగా నుండవలెనట కాని జాతీయ జీవిత పునాదులను నిర్మించి దానియభివృద్ధిని చూరగొన యోగ్యమైన సిద్ధాంతములలో మాత్రమెట్టి ప్రమాణము నక్కరలేదట !

జాతీయ విద్యలేనిదే (దీనినుండి యే జాతీయత యేర్పడగలదు) జాతీయనైతిక స్థితి కలుగనేరదు.

నాగరికు లందరకును సమముగా వర్తించు జాతీయ విద్య లేనిదే సమానధర్మములు సమాన హక్కులు అను సిద్ధాంతమున కర్థమేమియును నుండదు. అట్టిచో ధర్మములను గ్రహించుటయు హక్కులను స్థిరపరచుకొను శక్తియు నదృష్టముకు గాని బోధకులను నియమించువారి నిరంకుశేచ్ఛకు గానివిడిచిపెట్టబడు చున్నది.

సమానవిద్య యుండరాదను వారు స్వాతంత్ర్యమున కది భంగమందురు. ఎవరి స్వాతంత్ర్యమునకు? తండ్రి స్వాతంత్ర్యమునకు భంగకరమా కుమారుని స్వాతంత్ర్యమునకు భంగకరమా? తండ్రులు నిరంకుశులై తమ విధానముచే బిడ్డల స్వాతంత్ర్యమును భంగము చేయుచున్నారు. యువజనుల స్వాతంత్ర్యము ముసలివాండ్ర కొరకు ఆహుతి చేయబడుచున్నది. అభివృద్ధి యగుటకు గల స్వాతంత్ర్యము మాయమగుచున్నది వృద్ధుల యభిప్రాయములను మాత్రమే (బహుశః యభివృద్ధికి విరుద్ధములు ద్రోహకరములునైనవి) పిల్లలపై రుద్దుచున్నారు.

ఒకవంక తండ్రుల యధికారము మీస్వాతంత్ర్యముగా నాలోచించుకొనలేని మీవయస్సు దీనికి తోడ్పడుచున్నవి తరువాత పగలంతయు పాటుపడినగాని దినము గడవని మీవంటి వారదివరకే యేర్పడినయట్టి విశ్వాసముల నితరములతో పోల్చుటకు వీనిని మార్చుకొనుటకు నవకాశమేలేదు. ఇట్టియబద్ధపు స్వాతంత్ర్యముపేర నతి నికృష్టమైన నిరంకుశత్వము మేర్పడి శాశ్వత పరిపాలనము స్థాపించుకొనినది.

ఇది స్వాతంత్ర్యముకాదు; నిరంకుశేచ్ఛ; సమభావము లేనిదే యదార్థమైన స్వేచ్ఛయుండజాలదు. ఒక పునాది యొక సామాన్య సిద్ధాంతము యొక ధర్మములేనిచోట సమభావముండదు. ధర్మము గ్రహింపబడనిచోటస్వాతంత్ర్యమునకు స్థానమే లేదు. యదార్థ స్వేచ్ఛ యనగా నీయిష్టమువచ్చినట్లు చెడ్డను చేబట్టు హక్కు కాదనియు కళ్యాణము నొనగూర్చు మార్గముల ననుసరించు హక్కులనియు చెప్పియుంటిని ఈయసత్య వేదాంతులు స్వేచ్ఛయని పిలుచునట్టిది. తండ్రి కుమారుని కొరక చెడుగు నంట కట్టుట కిచ్చిన నిరంకుశ హక్కు కాని మరియొకటికాదు తండ్రికుమారుని కాలుచేతులనో మరే యంగమునో భంగ మొనర్చి వికలాంగునిచేయుననుకొనుడు! అప్పుడు ప్రజాభిప్రాయము ప్రతికారము సంఘమంతయు వానిపై చర్యదీసుకొనును. శరీరముకన్న నాత్మ, మనస్సు తక్కువప్రధానమైనవని మీయభిప్రాయమా? ఈశక్తులు భంగముకాకుండ

కాపాడుటయు నజ్ఞానము నీతి భ్రష్టతలేక మౌర్ఖ్యము మొదలగు వానినుండి గాపాడుటయు సంఘముయొక్క ధర్మము కాదా ?

విద్యా స్వాతంత్ర్యమను రావమొకప్పుడు ప్రయోజనకారిగా నుండెననుటకు సందియము లేదు; ఇప్పుడు గూడ నైతికవిద్యయే నిరంకుశప్రభుత్వ హస్తగతమో లేక కుటిలకులము లేక నభివృద్ధి నాటంకపరచునట్టి పురోహిత బృందముయొక్క వశమో యైనపుడిది యవసరమే ! నిరంకుశత్వముపై దండెత్తుట కిదియొక యాయుధము; మన మోక్షము కిదియపరిపూర్ణమైనను ముఖ్యమైన యాహావరావము మీరు బానిసలైన చోట నిది మీకు ప్రయోజనకారి కాగలదు; కావలెను. కాని మతవిశ్వాస మభివృద్ధియను పరమును శాసించిననాడు. జాతీయవిద్య తగువిద్యనొసగి విద్యార్థుల నీక్రింది వాక్యములతో విడిచివేయు నాడు జరుగవలసిన దానినే నేడే చెప్పుచున్నాను. "మీయందరితో నొక సామాన్యాం గీకారముక్రింద జీవించుట మీకును తప్పనిసరి; ఇట్టి మనయందరి యంగీకారములోను గల మూలతత్త్వ మేదియో మీకు బోధించితిమి; నేడు మీజాతి విశ్వసించుచున్న సిద్ధాంతములను బోధించితిమి. కాని యీ సిద్ధాంతములలో మొదటిది యభివృద్ధి యనుసంగతి మీకు మరువరాదు. మీ సోదరుల మనస్సులను, హృదయములను మీశక్తికొలది మీ కవకాశమున్నంతవర కభివృద్ధి

చేయుటే మీ మానవధర్మమనియు, నాగరిక ధర్మమనియు గుర్తెఱుంగుడు. మీయంతట మీరు యథేచ్ఛగా నాలోచించు కొనుడు! పరీక్ష చేసుకొనుడు! పోల్చుకొనుడు! మేము విశ్వశించుచున్న సత్యములకన్న నుత్కృష్టమైన సత్యము మీకు దొరకినచో దానిని నిర్భయముగా చాటుడు! అప్పుడు మీ దేశము మిమ్మాశీర్వదించును! బోధనా స్వాతంత్ర్యము మీజాతీయైక్యతకు వినాశకరమనియు, మీ యవసరములకు చాలనిదనియు వాదించు వాదనను మీరెప్పుడు వదలుకొనవచ్చును; కాని యంతదనుక విడువరాదు. అందరకు ప్రతివారికిని సర్వందముగాను నుతజాతీయ విద్య యుండవలెను. దీనిని మీరు ప్రభుత్వము నడిగి లాగికొనవలెను."

తనవిధానమును ప్రతినాగరికునకును తెలియపరచుట జాతియొక్కధర్మమై యున్నది. ప్రతినాగరికుడును జాతీయ పాఠశాలలలో నైతికవిద్యను, వివిధజాతుల చరిత్రను. స్థాలీపులాకన్యాయముగా మానవాభివృద్ధిని, తన దేశచరిత్రను, తనదేశమును నడుపు శాసనములయొక్క సూత్రములను, ప్రాథమిక శిక్షమొదలగువానిని నేర్చుకొనవలయును; తెలిసికొనవలెను. ప్రతినాగరికుడు నీపాఠశాలలలో సమత్వమును ప్రేమను నేర్చుకొనవలెను.

ఇట్టివిధానము నాగరికుల కందజేయబడినపుడు స్వాతంత్ర్యము తనహక్కులను మరలసంపాదించుకొనగలదు. గృహ

ములో చేయబడుబోధయే కాక ప్రతిబోధయు పవిత్రమైనదే యనిగ్రహింపవలెను. ప్రతివాడును తనభావముల నితరులకు తెలియజేయుటకు సంపూర్ణాధికారమును కలిగియున్నాడు; ప్రతివానికిని వానిని వినుటకు సంపూర్ణాధికారముకలదు. మనభావములను స్వేచ్ఛగా నన్నిరూపములలోను బ్రకటించుటనుసంఘము హెచ్చరించవలెను; సాంఘికవిధానమును మంచికిమార్చుటకును, అభివృద్ధికి తెచ్చుటకును గల మార్గములనన్నిటిని నిష్కంటకము గావింపవలెను.



# సంఘము అభివృద్ధి

పదియవ ప్రకరణము.

భగవంతుడు మిమ్ము సాంఘికజీవులుగాను అభివృద్ధి నొందు జీవులుగాను సృజించినాడు. కనుక మీరున్నపరిస్థితులలో మీకవకాశమున్నంత వరకు సౌభాగ్యతుష్టిత్వమును, అభివృద్ధిని చూరగొనుటయే మీధర్మము. ఇట్టి నీప్రయత్నములలోనిసంఘమునీకెట్టి యాటంకములను కల్పింపకుండుటే గాక నీకుతోడ్పడునట్లుదానిని నిర్బంధించుటకు గూడ నీకుహక్కు కలదు.

స్వాతంత్ర్యము నీకు మంచిచెడుగులను నిర్ణయించుకొనటకు అనగా ధర్మమును స్వార్థమును నిర్ణయించుకొనట కధికారము ను ప్రసాదించుచున్నది. విద్య యీరెంటిలో యోగ్యమైన దానిని నిశ్చయించుకొను శక్తినిబోధించవలెను. ఇట్టినీ నిర్ణయమునాచరించుటకు తగుసాధనములు సంఘమువలన చేకూరవలెను. నీవునిర్ణయించుకొను నపుడభివృద్ధియే నీయెదుటనుండవలెను. ఈనీయభివృద్ధియే నీవుతప్పుమార్గమును త్రొక్కలేదని రుజువుచేయగల నిదర్శనము. ఈపై నుదహరింపబడిన పరిస్థితులలోనే యొక్కటి నిర్లక్ష్యము చేయబడినను లేక లాగి

కొనబడినను మనము మానవులము కాజాలము; నాగరికులము కాజాలము; మనజీవితము సంపూర్తిజీవితము గాదు; మన యభివృద్ధి నిరోధింపబడును

కనుక మీరీ యన్నిటికొరకును పోరాడవలెను; ముఖ్యముగా మీ కలయిక సౌభ్రాతృత్వ మత్యవసరము; అదిలేని దే విద్యయు, స్వేచ్ఛయు నిష్ఫలములు. మత మెంతపవిత్రమైనదో యిదియునంత పవిత్రమైనది. జీవుల సౌభ్రాతృత్వము; మత మాత్మ సౌభ్రాతృత్వమును సూచించును. మీరందరును భగవంతుని పుత్రులు; కనుక సోదరులు. మీ కలయికను మీసాయుజ్యమును పరస్పర హావ, భావ, చేష్టమూలమున గలుగు నభివృద్ధిని నిరోధించుట నేరముకాదని యెవడు చెప్పగలడు?

సాయుజ్యము అను పదమును క్రీస్తుమతము మొదట తెచ్చిపెట్టెను. ఈమతమే సనాతన సత్యమని వెనుకటివారు భావించుచుండిరి. కాని మానవలోకమున ప్రదర్శింపబడు మతములనెడి సోపానములలో నిదియొక సోపానము. సాయుజ్యమను పదమతి పవిత్రమైనది. అది మానవులందరును భగవంతుని దృష్టిలో సములనియు బోధించెను. అది యజమానిని బానిసనుకూడ నొకే యాశయముతో, నొకే మోక్షముతో, నొకేస్వర్గీయప్రేమతో బంధించివైచెను.

ఈక్రైస్తవ సిద్ధాంతము తత్పూర్వపు సిద్ధాంతముకన్న చాలముందంజ వేసెను; అభివృద్ధిని సూచించెను. ప్రజలను

వేదాంతులునుకూడ (తత్పూర్వము) నాగరికుల యాత్మలు వేరనియు బానిసలయాత్మలు వేరనియు విశ్వసించెడివారు. సాయుజ్యమే యాత్మ సౌభ్రాతృత్వమునకును, సమత్వమునకును చిహ్నము. ఈచిహ్నములోనున్న సత్యమును అభివృద్ధిచేయుట కించుట మానవలోకము చేయవలసిన పనియని గుర్తింపవలెను.

చర్చి (క్రైస్తవదేవళము) యీపనిని చేయజాలకపోయెను; మొదట నదిపిరికితనమును, సందేహ మనస్కతను జూపెను. తరువాత రాజులతోను, ప్రభుత్వముతోను చేతులుకలిపెను; దాని స్థాపకునకు విరుద్ధమైన ధనమదాంధులతత్వము దానికబ్బుటచే నది పెడమార్గమును బట్టిసాయుజ్యము రెండువిధములనియు మామూలు ప్రజలందరకు నాహార పానీయములు మొదలగు కుక్షింభరత్వములోనే సాయుజ్యమనియు మతబోధకులకు మాత్రమే యైహికాముష్మిక సాయుజ్యమనియు బోధింపసాగెను.

తరువాత మానవ కుటుంబము కంతకు నిట్టి యధికారముకలదనియు ప్రజలు, మతబోధకులు నను తారతమ్యము లేదనియు బోధింపబడెను. పదిహేనవ శతాబ్దములో ప్రజలిట్టి యధికారముపేరనే తిరుగబడిరి; దేశభక్తులు మతసంస్కారముకొరకు ప్రాణముల నర్పించిరి. జాన్ హస్ అను నొక పవిత్రపురుషు డగ్నిహోత్రజ్వాలల కాహుతియయ్యెను.

మీలో చాలమంది కీర్తి తెలియనే తెలియదు ! లేక యివి కేవలము పై వికవిషయములనియు మరెప్పుడో పోరాడుకొనిన పోరాటములనియు మీరు కొనవచ్చును. కాని మత మునందే మాత్రమభివృద్ధి కలిగినను మనజీవితములలో నభివృద్ధి కలుగునని మీరు గ్రహింతురేని మీకీ పోరాటముల యొక్క ప్రాముఖ్యత తెలియగలదు అప్పుడీ దేశభక్తులందరును మీ కళ్యాణము కొరకే పోరిరని మీరు వారిని సదా స్మరింప గలరు.

భగవంతునకును మానవునకును మధ్య ప్రత్యేకాధికారములుగల జాతియేదియు లేదని నేడు మనము గ్రహించినారము; ఇట్టిజ్ఞానము మనకీ దేశభక్తుల త్యాగముల వల్లనే కలిగినది. గుణముచేతను, దివ్యజ్ఞానముచేతను మానవతత్వ జ్ఞానముచేతను శ్రేష్ఠులైనవారు మనకు హితబోధ చేయవచ్చును మనలను సన్మార్గమున పెట్టవచ్చును; పెట్టవలెను. కాని యొకప్రత్యేకాధికారియు, గొప్పతనము మొదలైనవి గుత్తగా సంక్రమింపజాలవు గణవత్సాయుజ్య మందరికిని సమానమే ! స్వర్గములో పవిత్రమైన దీపపంచములో గూడ పవిత్రవంతమే యగును. మానవులందరును భగవత్సాయుజ్యమును బొందునపుడు వారీప్రపంచ జీవితములోగూడ సౌభ్రాతృత్వమునే గలిగియుండవలెనని వేరుగ చెప్పవలెనా?

సంఘమే మీ ధర్మము; మీ హక్కు. నాగరికుని

సాంఘికాధికారము నియమించవలెనని కొందరియభిప్రాయము. వాండ్లు వాదింతురు. జాతిలేక ప్రభుత్వమే నిజమైన సంఘము మీరందరును దానిలో సభ్యులు; సభ్యులుగానుండి తీరవలెను. కనుక మీలో మీరొక ప్రత్యేకసంఘము నేర్పరచుకొనుట ప్రభుత్వముకు అనగా జాతికి విరుద్ధము; అనవసరము.

కాని ప్రభుత్వము లేక జాతియా జాతికి చెందినయందరి యొక్క సామాన్య విషయములను, లక్ష్యములను మాత్రమే వ్యక్తము చేయు నాగరికులసంఘము. కాని యందరికిని చెందక కొద్దిమందికే చెందునట్టి కొన్నిలక్ష్యములును గమ్యములును ప్రత్యేకముగానుండును. అందరికిని సామాన్యమైన లక్ష్యములును గమ్యములును జాతియెట్లగానో యట్లే కొద్దిమందికి చెందునట్టి లక్ష్యములు ప్రత్యేక సంఘమగుచున్నది.

సంఘమే యభివృద్ధి కుత్తరవాది కావలెను. ప్రభుత్వమనగానది స్థాపింపబడినపు డున్న ప్రజలందరు నంగీకరించినట్టి కొన్ని సూత్రములకు ప్రాతినిధ్యము వహించునొక సంఘము. నాగరికులలో కొంతమంది కొక నూతన సిద్ధాంతము యొక యదార్థమైన సిద్ధాంతము ప్రభుత్వముకు ప్రాణమునిచ్చు సత్యములలో నూతనాభివృద్ధి యొకటి పొడగట్టెనను కొనుడు. సంఘ మొకటి లేనిచో వారు దాని నెట్లు వ్యాప్తి చేయగలరు?

ఆధునిక శాస్త్రపరిజ్ఞానాభివృద్ధి చేతనో లేక నేడు ప్రజలకును ప్రజలకునుగల దూరమంతయు వాయు విమానములు మొదలగువానిచేత నంతరించుట చేతనో లేక మరే కారణము చేతనో యొకనూతనప్రయోజనము కొంతమందికి బొడగట్టుననుకొనుడు వీరందరునుతమ వివిధశక్తులను తమసాధన సంపత్తినియోకము చేసినగాని యీప్రయోజనము కిదివరకున్న వాటితోపాటు స్థానమేర్పడజాలదని వేరుగ జెప్పనక్కరలేదు. తమస్సు యిదివరకున్న పరిస్థితులతో తృప్తిజెందుచుండుట; ప్రజలందరిచేనివి సామాన్యముగా నంగీకరింపబడుట యీకారణములచే నొకవ్యక్తి వీనినన్నింటిని త్రోసివేయజాలడు; తెంచుకొనజాలడు. కాని కొద్దిమందియైనను నొకసంఘము దినదిన ప్రవర్ధమానమగుచు వీనిని కూలద్రోయగలదు. సంఘములేక సౌభ్రాతృత్వము భావివిధానము కావలెను. ఇదిలేనిదే ప్రభుత్వమిదివరకు పొందిన యభివృద్ధితో విజ్ఞానముతో నాగిపోయి స్తంభించిపోవును. మానవలోకమంతయు జాతియంతయునైక్యకంఠముతో నంగీకరించిన సనాతన సత్యములకు విరుద్ధముగానుండని యభివృద్ధియే సంఘముయొక్క యాశయమైయుండవలెను. ఇతరుల యాస్తిని దొంగిలించుట కవకాశములను కల్పించు సంఘము; తనసభ్యులందరును విధాయికముగా బహుభార్యాత్వము నొప్పుకొనవలెనని విధించు సంఘము; జాతిని ధ్వంసము చేయవలెనని బోధించు సంఘము; నిరంకుశత్వమును

స్థాపింపవలెనని బోధించు సంఘము, యిట్టి వన్నియు న్యాయ విరుద్ధములు ఇట్టి తన సభ్యులను జాతి యథావిధముగ శాసించుటకు హక్కుకలదు. “మానవసంస్కృతికి సత్తకి, దేశమునకు విరుద్ధమైన సూత్రములు మనలో వ్యాప్తిచెందుటకు మనమిచ్చగింపరాదు; సహింపరాదు. మీరు మానసికహద్దులను దాటిపొండు! మీయిష్టమువచ్చినచోట మీలో మీరు మీబుద్ధిశక్త్య జన్యమైన సంస్థను సృష్టించుకొనవచ్చును”

సంఘము శాంతిపైననే యాధారపడవలెను. లిఖిత పూర్వకము లేకవచ్చు పూర్వకమైన శాసనముకన్న వేరు ఆయుధములేవియు నుండరాదు. అవికూడ నిర్బంధముపైగాక విద్యలేక సంస్కార పూర్వకముగా మాత్రమే యుండవలెను.

సంఘము బహిరంగముగా నుండవలెను. స్వాతంత్ర్యము, దేశముయొక్క నవేలేనిచోట రహస్యసంఘములు ధర్మయుద్ధమున కగత్యమగు నస్త్రములు కాగలవు స్వాతంత్ర్యమంగీకరింపబడిన దేశములో నిట్టిరహస్యసంఘము లుండనక్కర లేదు, ఉండరాదు. సంఘముకూడ నభివృద్ధికిమార్గమీయవలెను. కనుక నదియందరి పరీక్షకు, విమర్శకులోనయి యేయుండవలెను.

సంఘము మానవసంస్కృతి యొక్క ముఖ్యపరిస్థితులచే సంక్రమించునట్టి యితరుల హక్కులను గౌరవించవలెను. కార్మిక స్వాతంత్ర్యమునుగాని మతస్వాతంత్ర్యమునుగాని నిరో

ధించునట్టి సంఘమును జాతి తన ప్రభుత్వముద్వారా నణచి వేయుట ధర్మమేయగును; అణచివేయవలెను.

ఇట్టి మర్యాదలను పాటించునపుడు నాగరికులు సంఘముగా నుండుటకు పవిత్రమైన యప్రతిహతమైన హక్కును కలిగియున్నారు. దీనిని నిరోధించునట్టి యేప్రభుత్వమైనను తన సాంఘిక ధర్మమును విడనాడిన దగును. ప్రజలిట్టి ప్రభుత్వమునకు మొట్టమొదట బుద్ధిచెప్పవలెను; అట్లు చేయుట వారి ధర్మము; తరువాత నన్ని శాంతిపద్ధతులును విఫలములైనచో నాప్రభుత్వమును కూలద్రోయవలెను.

సోదరులారా! యీప్రధాన శూత్రముల మీదనే మీధర్మములు నిర్మింపబడుచున్నవి; మీహక్కు లీధర్మముల నుండియే యుద్భవించుచున్నవి. మీ నాగరిక జీవితములో ననేక ప్రత్యేకసమస్యలు మిమ్మెదుర్కొ-న వచ్చును. కాని యీపుస్తకము వానినన్నిటిని నివారణ చేయుటకు వ్రాయబడలేదు. అంధకారమున మార్గమును జూపునట్టి దివ్వెలవలె మిమ్మిట్టి సమస్యలలో నడుపగల సిద్ధాంతములను ప్రకటించుటయే యీపుస్తకముయొక్క ప్రయోజనము శ్రద్ధతో నీసిద్ధాంతముల నాచరించిన యెడల నెట్టిసంకటములకైన నివారణ సాధనములు మీకు గోచరింపక మానవు. నావిధిని నేను నెరవేర్చితిని.

మానవ సమత్వమునకు భగవంతుడే మూలము భగవం
తుడే ప్రమాణము యనినేను చెప్పియుంటిని. ప్రతినాగరిక
చట్టమునకు నైతికచట్టమే పునాదియనియు, చట్టనిర్మాతల శీల
మును బరీక్షించుటకిదియే పరమాణమనియు చెప్పియుంటిని.
నీవు, మనము, ప్రజలు, జాతిలో నున్న ప్రజావళియంతయు
నీ న్యాయమునకు న్యాయమైన యనన్యమైన వ్యాఖ్యాతలము;
రాజకీయాధికారమునకంతకును మూలము మనమే !

న్యాయముయొక్క ప్రధానలక్షణ మభివృద్ధియే యని
కూడ నేను చెప్పియుంటిని; ఈయభివృద్ధి యుగయుగము ననం
తముగా నిరంతరముగా సాగుచునేయుండును; ఈయభివృద్ధి
మానవకలాపమునకు నన్నిశాఖలకు, ప్రతిభావప్రకటనమును
మతము మొదలు పరిశ్రమలవరకు, జాతీయసంపదను పంపక
ముచేయువరకు సర్వతోముఖముగ జరుగుచునే యుండును.

మానవ కోటికిని, మాదేశమునకును కుటుంబమునకును,
మీకునుగూడ మీరు చేయవలసిన ధర్మములను మీకుచెప్పి
యున్నాను. మానవకోటిని గూర్చుచున్నట్టి లక్షణములనుండి
యే నేను ధర్మములను సంగ్రహించితిని వీని నభివృద్ధిచేయుట
మీధర్మమై యున్నది. అప్రతిహతములగు నీలక్షణము లేవి
యనిన స్వాతంత్ర్యము, విద్యావక్షత, సాంఘిక స్వభావములు
సామర్థ్యత, యభివృద్ధిచెందవలసిన యగత్యము మొదలగునవి.
ఈప్రధాన లక్షణమున నుండియే (ఇవిలేనిచో మానవుడు

కాదు; నాగరికుడు కాదు) నేను మీ ధర్మములను; మీహక్కులను, మీరు మీ దేశములకొరకు నిర్ణయించుకొనవలసిన ప్రభుత్వ స్వభావమును నిర్ధారణ చేసితిని. ఈసిద్ధాంతముల నెన్నడును మరచిపోవలదు. వీనినెవరును భంగపరుపకుండ మీరు వేయికళ్లతో జూచుచుండవలెను. వీటిని మీయందు మూర్తీభవింపజేసికొనుడు! మీరపుడు స్వతంత్రులగుదురు; అభివృద్ధి చెందుదురు.




ఈశ్వర ప్రెస్, రాజమండ్రి. 1000—1930

158

## మహారాజ పోషకులు

1 శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, చెన్నపట్నము.

2 నడింపల్లి సుబ్బరాజుగారు, కోడూరుపాడు.

3 జాబాల చలమయ్యశాస్త్రిగారు, రాజమండ్రి.

4 బచ్చు సత్యనారాయణమూర్తిగారు, కూనవరం.

5 దేవులపల్లి సోమయ్యగారు, ఆకిరిపల్లి.

## రా జ పో ష కు లు

6 శ్రీరాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారు వారు, నూజివీడు.

7 కామర్సు బాలకోటీశ్వరరావుగారు, దువ్వ.

8 పల్ల సూర్యనారాయణగారు, వకీలు, కొవ్వూరు.

9 దామోజీపురపు సత్యాధిరావుగారు ,,

10 బలిజేపల్లి సుబ్రహ్మణ్యంగారు, వకీలు తణుకు.

11 కలిదిండి గంగరాజుగారు, తాడేపల్లిగూడెం.

12 మదిపల్లి అమ్మిరాజుగారు, ఆరవల్లి.

## ప్రధానపోషకులు.

13 డాక్టరు జీడిగుంట కామరాజుగారు, నిడదవోలు.

14 డాక్టరు సత్తిరాజు వెంకట్రావుగారు, అత్తిలి.

15 శివృషు శివరావుగారు, కొవ్వూరు.

16 చేప నారాయణమూర్తిగారు, తొంపంగి

17 ముళ్ళపూడి తిమ్మరాజుగారు, జమీందారు తణుకు.

18 తల్లాప్రగడ కామేశ్వరరావుగారు, ఉంగుటూరు.

19 తల్లాప్రగడ భీమేశ్వరరావుగారు, ,,

20 పులవర్తి లక్ష్మణస్వామిగారు, ఆకివీడు.

21 పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.

22 దేవులపల్లి రామమూర్తిశాస్త్రిగారు,
అగ్రహారందారు, తిమ్మరాజుపాలెం.

23 వెలగల శ్రీరామరెడ్డిగారు, అరవల్లి.

పోషకులు.

24 బొడ్డుపల్లి లక్ష్మీనారాయణగారు, కొవ్వూరు.

25 డాక్టరు యర్రమిల్లి దీక్షితులుగారు, నిడదవోలు.

26 డాక్టరు సజీవుఅమ్మద్ గారు, తాడేపల్లిగూడెం.

27 కతారి అచ్యుతరామరాజుగారు, ఒడ్డూరు.

28 రేకపల్లి వర్ఘులుగారు, వకీలు రాజమండ్రి.

29 గొడవర్తి నాగేశ్వరరావుగారు, ఆచంట.

30 బోళ్ళ వెంకటరత్నంగారు, పెదపట్నమగ్రహారం.

31 తుమ్ములపల్లి సత్యనారాయణగారు, పిప్పర.

32 తుమ్మలపల్లి లక్ష్మినారాయణగారు, ,,

33 ఇందుకూరి సుబ్బరాజుగారు, పిప్పర.

34 మాజేటి రామచంద్రరావుగారు, ఏలూరు.

35 జోస్యుల రామచంద్రరావుగారు, వకీలు.

రామచంద్రపురం.

36 న్యాపతి సుబ్బారావుపంతులుగారు, వకీలు రాజమండ్రి.

37 జూపూడి సుబ్బన్నగారు, ఆకివీడు.

38 పాలిన రాజులనే రామచంద్రుడుగారు, ములకల్లంక.

39 గాడేపల్లి హనుమానులుగారు, అత్తిలి.

40 బొమ్మకంటి రామమూర్తిశర్మగారు, నిడదవోలు.

41 ఆరుమిల్లి వెంకటసుబ్బారాయుడుగారు, నాగుల్లంక.

42 రావుసాహేబు కళ్ళిచిట్టిఅబ్బాయినాయుడుగారు, పూళ్ల.

43 పెన్మెత్స రాఘవరాజుగారు, గోటేరు.

44 కర్రా శ్రీరామమూర్తిగారు, ఏనుగుమహాలు.

45 అరవ తిరుపతిరాయుడుగారు, రాజమండ్రి.

46 తేతలి సీతారామయ్యగారు, తేతలి.

47 రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు, కొవ్వూరు.

48 ప్రభల చిన్నసుబ్బారావుగారు, పుల్లేటికుర్రు.

49 నామన బాపన్నగారు, దేవరపల్లి.

50 పెండ్యాల రామలింగంగారు, తాడేపల్లిగూడెం.

51 తురగా పురుషోత్తంగారు. పలివెల.

52 ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారు, దువ్వ.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B110 |
| పుస్తకం పేరు | మానవధర్మములు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 159 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Saumya |
| పేజీలు విడదీసినది | Saumya |
| స్కాన్ చేసినది | Triveni |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |